





# కథలు

నీతి, పురాణ, పొడుపు

## బాలానంద బొమ్మల పంచతంత్రం- 1 , 2





# సదాశివ సమారంభాం


గురు దకిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రదువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రదుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120003900,2020120034165

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక

# పరిచయం

పంచతంత్రం కథలు వినగానే మనకు రకరకాల జంతువులు, పక్షులు, వాటి యెత్తులు, పై యెత్తులు గెలుపు ఓటములు గుర్తుకువస్తాయి. ప్రధాన కథతో పాటు యెన్నో నీతుల్ని చెప్పే పిట్టకథలు కనిపిస్తా. గర్జించే సింహాలు మాట్లాడతాయి. గాండ్రించే పులులు పలుకుతాయి. కువకువలాడే పావురాయిలు, కిచకిచలాడే కోతులు సంభాషిస్తాయి. ఎద్దులు, గ్రద్దలు, ఎలుకలు, జింకలు - ఒకటేమిటి మనకు పరిచయం ఉన్న అన్నిరకాల జంతువులు, పక్షులు పరస్పరం మాట్లాడుకొంటాయి ఒక్కొక్కమాట ఒక్కొక్క నీతికికోట. ఒక్కొక్కకథ ఒక్కొక్క జీవిత సత్యానికి సాక్ష్యం. పైగా జంతువులు, పక్షులు మాట్లాడడం అంటే సరదాగా వుంటుంది. అందుకే పంచతంత్రం దేశ దేశాల పాఠకుల్ని ఆకర్షించింది. తరతరాల బాలబాలికల్ని అది ఆకట్టుకొంది. ఎన్నో భాషలలోనికి అనువదించబడింది. ఎందరెందరో ఆ కథల్ని వ్రాశారు, వ్రాస్తున్నారు.




సుదర్శన మహారాజుగారికి మగపిల్ల లున్నారు. కాని వారికిని లోకజ్ఞానం లేదు. వారికి సులభంగా విద్యాబుద్ధులు నేర్పి ఇంగిత జ్ఞానాన్ని ఇవ్వగల పండితు నకై అన్వేషించిన రాజుగారికి తమ పాటలీపుత్ర నగరంలోనే విష్ణుశర్మ అనే ఉత్తమ బ్రాహ్మణుడున్నాడని తెలిసింది. ఆయనకు కబురు పెట్టాడు. తన పిల్లల సంగతి చెప్పాడు. వారికి తక్కువకాలంలో లోకజ్ఞానం తెలిసేలా చేయమన్నాడు.

విష్ణుశర్మ "అలాగే" అని ఆ బాలకుల్ని తీసుకువెళ్ళాడు. వారికి చిన్న చిన్న కథలద్వారా లోకజ్ఞానాన్ని, రాజనీతిని బోధించాలనుకున్నాడు వారుకూడా కథలపట్ల ఆసక్తి చూపారు. విష్ణుశర్మ చెప్పిన నీతికథలు అన్నింటినీ కలిపి "పంచ తంత్రం" అంటారు.

"పంచ" అంటే ఐదు అని. "తంత్రం" అంటే "ఉపాయం" అని అర్థం. మనిషికాని, రాజుకాని తన జీవితంలో ఎటువంటి సమస్యలు ఎదురైనా ఈ అయిదు రకాల ఉపాయాలతో గట్టెక్కవచ్చునని విష్ణుశర్మ వారికి ఉపదేశించాడు. ఆ ఉపా యాలు 1. మిత్రలాభం. 2. మిత్రభేదం 3. విగ్రహం 4. సంధి 5. లబ్దనాశం.

ఈ ఐదు ఉపాయాలలో మొదటి నాలుగు ప్రకరణాల కథలు బాగా ప్రచారం పొందాయి. మిత్రలాభం, మిత్రభేదం కథల్ని చిన్నయసూరి ఆనాటి తెలుగు వచనంలో అందంగా వ్రాశాడు. "విగ్రహం, సంధి" ప్రకరణాలను వీరేశ లింగం పంతులుగారు వ్రాశారు లబ్దనాశం కథల్ని చెరకువాడ వేంకటరామయ్యగారు రచించారు. ఇవన్నీ భాషాపరంగా పిల్లలకు అందుబాటులో లేనివి. అంతేకాక ప్రధాన

కథలోంచి చిన్నకథలు బీరపాదులా అల్లుకుపోయి వుంటాయి. కనుక గుర్తుంచుకోవడం కష్టం.

బాలబాలికలకు సులభంగా ఈ కథల్ని చెప్పాలని ఈ ప్రయత్నం. మూల పంచతంత్రం వలెకాక ఏ కథకాథగా వీటిని చదువుకుందాం. ఆ కథ చెప్పే నీతిని



చివరవాక్యంలో తెలుసుకొందాం. "పంచతంత్రం"లో మొదటితంత్రం "మిత్రలాభం" మంచి స్నేహితులవల్ల లాభాలు చెడు స్నేహితులవల్ల కష్టాల గురించి యీ కథలు తేటతెల్లం చేస్తాయి. ఇది పంచతంత్రం గురించి పరిచయం. ఇక కథల ప్రపంచంలో ప్రవేశిద్దాం.




## హి ర ణ్యా కు డు

హిరణ్యాకుడను ఒక ఎలుక చాలా తెలివైనది, మంచిది. ఎటువంటి అవమానాన్ని భరించలేదు, తనవారెవరికి ఏ ఆపద వచ్చినా వెంటనే సహాయంచేసే ఉపకార గుణం ఉన్న మంచి ఎలుక అది.

ఒక నగరంలోని మఠంలో దాని కాపురం. అక్కడ సాధువులు ఎక్కువగా వుండేవారు. వారిలో చూడాకర్ణుడు అనే సాధువు ఒకడు. అతను మఠంలోని తన గదిలో ఒక చిలకకొయ్యకు తాడుకట్టి దానికి తన జోలి తగిలించేవాడు. ఆజోలెలో బియ్యం వగైరా వుండేవి.

అతని గది ప్రక్కనే నేలలో హిరణ్యాకుడు పెద్ద కన్నంచేసి కాపురం వుంటుండేది. చూడాకర్ణుడి జోలిలో వదిలివేసిన బియ్యాన్ని, ఇతర రకాలైన ఆహార దినుసుల్ని, కూరగాయల్ని రహస్యంగా దొంగిలించి తన కలుగులోదాచేది. ఈ రకంగా ఆ ఎలుక బోలెడు ధాన్యాన్ని ఆహార దినుసుల్ని నిలవ చేసింది. దాని జాతి వారిలో అదే గొప్పది.

అయితే చూడాకర్ణుడు ఒకనాడు ఎలుక సంగతి పసిగట్టాడు. తానుదాచుకొన్న వాటినన్నిటిని దొంగిలిస్తున్న ఎలుకల్ని నాశనం చేయాలని నిశ్చయించాడు. మరునాడు గునపం తెచ్చి ఎలుక కన్నము తవ్వించాడు. కనిపించిన ఎలుకనల్లా

చంపించాడు. తెలివైన హిరణ్యకుడుమాత్రం తప్పించుకుంది. ఆ మఠంలోనే మరొక చోట మకాం పెట్టాలనుకొన్నది. కాని అనుమానం వచ్చినచోట, అవమానం జరిగిన చోట ఉండరాదని అక్కడనుంచి వెళ్ళిపోవాలనుకుంది.



పట్టణాలలో అయితే ఎక్కడ ఉన్నప్పటికీ ఇటువంటి అనుమానాలు తప్పవని, అరణ్యములో అయితే అక్కడ దొరికిన పళ్ళు ఫలాలు తిని హాయిగా బ్రతకవచ్చునని ఆలోచించి హిరణ్యకుడు అడవిలోకి వెళ్ళిపోయింది.

అడవిలో దానికి మంధరుడు అనే తాబేలు, లఘుపతనకుడు అనే కాకి స్నేహితులయ్యారు. మూడూ ఎంతో స్నేహంగా ఉంటున్నాయి. ఈ హిరణ్యకునకు చిత్రగ్రీవుడు అనే ఒక పావురం కూడా స్నేహితుడు.

ఒకసారి అడవిలో వేటగాడు నూకలు చల్లి వలపన్ని దూరంగా పోయి దాక్కొని చూస్తున్నాడు. అదే సమయంలో అటువైపుగా ఆకాశంలో ఎగురుతూ పావురాళ్ళ గుంపు వచ్చింది- భూమిమీద నూకలుచూసి తినాలనుకున్నాయి. ఆ పావురాళ్ళలో చిత్రగ్రీవుడు ఉన్నాడు.



"అడవిలో నూకలు రావడము విచిత్రంగా ఉంది. ఇది యెవరో వేటగాని పన్నాగం. మనం దిగవద్దు" అని చిత్రగ్రీవుడు అడ్డు చెప్పాడు. అయినా ఒక ముసలి పావురం మాటలు వినీ పావురాళ్ళు నేలమీద నూకలకోసం వాలాయి. వాలీ వాలగానే వాటి కాళ్ళు వలలో చిక్కుకున్నాయి. గింజుకొంటున్నకొద్దీ చిక్కు

పడిపోతున్నాయి! దూరంగా వేటగాడు రావడం కనిపించింది. తమకు చావు తప్ప దని అవి దిగులుపడ్డాయి.

అప్పుడు చిత్రగ్రీవుడు "మిత్రులారా! ఇప్పుడు విచారించి లాభంలేదు. మనం అందరం ఒకేసారి పైకి ఎగిరిపోదాం. నాకు హిరణ్యకుడు అనే మిత్రుడు



న్నాడు. అతని దగ్గరకు వెళ్ళితే వలకొరికి మనల్ని విడిపిస్తాడు" అని ఉపాయం చెప్పాడు.

చిత్రగ్రీవుని సలహా ప్రకారం పావురాళ్ళన్నీ ఒకేసారి రివ్వున గాలిలో ఆకాశానికి యెగిరాయి. వాటి కాళ్ళకు చిక్కున్న వలతో సహా అది ఆకాశంలోనికి యెగిరిపోవడంతో వేటగాడు నిరాశ చెందాడు. ఎక్కడయినా నేలవాలక

పోతాయా పట్టుకోలేకపోతానా? అని [illegible] పడ్డాడు.

చిత్రగ్రీవుడు మాట ప్రకారం [illegible] అయిన ఒక కన్నం దగ్గర వాలాడు. హిరణ్యకుడు [illegible]



చిత్రగ్రీవుడు "మిత్రమా! నేను చిత్రగ్రీవుణ్ని! ఆపదలో వున్నాను కాపాడు" అని పిలిచాడు.

చాలాకాలం తర్వాత మిత్రుడు వచ్చాడని, పైగా ఆపదలో ఉన్నాడని విని హిరణ్యకుడు వేగంగా కన్నంలోనుంచి బయటకు వచ్చాడు. తీరా చూస్తే

అక్కడ చిత్రగ్రీవునితోబాటు యెన్నో పావురాలు వలలో చిక్కుకొని గిలగిలలాడు తున్నాయి. సూక్ష్మగ్రాహి అయిన హిరణ్యకునకు సంగతి అర్థం అయింది.

వెంటనే పదునైన తనపళ్ళతో ఆ వల త్రాళ్ళు కొరికాడు. చిక్కులు విప్పాడు. పావురాళ్ళు వలనుండి బయటపడ్డాయి. హిరణ్యకునకు కృతజ్ఞతలు




చెప్పాయి. కొన్నాళ్ళు అతడి దగ్గరేవుండి చిత్రగ్రీవునితో సహా పావురాళ్ళు ఎగిరి పోయాయి.

నీతి : ఆపదలో ఆదుకొన్నవాడే మంచి స్నేహితుడు.

# చిత్రాంగుడు

పరోపకార బుద్ధిగల హిరణ్యకునికి మరో ఇద్దరు స్నేహితులున్నారని చెప్పుకున్నాం కదా! వారిలో ఒకరు కాకి. దాని పేరు లఘుపతనకుడు. మరొకరు తాబేలు. దానిపేరు మంధరుడు. అడవిలో వేరేచోట సరస్సులో ఉంటున్నాడు.




లఘుపతనకుడు హిరణ్యకుడు కలసి ఒకచోట ఉంటున్నారు. అయితే అక్కడ కరువువచ్చింది. ఆహారం దొరకడం లేదు. అందుకని హిరణ్యకుడు, లఘుపతనకుడు కలిసి మంధరుని దగ్గరకు వెళ్ళిపోయాయి.

అడవిలో ఆ ప్రాంతం బాగానే ఉంది. తాబేలుకు చెరువునిండా ఆహారం ఉంది. కాకికి ఆ చుట్టుప్రక్కల తిండి దొరుకుతుంది. ఎలుకకు లోటు లేకుండా

గడిచిపోతుంది. చెరువులో తాబేలు నివాసం. గట్టున చెట్టుపై కాకి ఇల్లు. చెట్టు మొదట కన్నంలో ఎలుక కాపురం.

ఆహారం సంపాదించడం, విందారగించడం కొంచెంసేపు విశ్రమించడం ఆ తర్వాత చెరువు ఒడ్డునచేరి సరదాగా మాట్లాడుకోవడం-ఆ ముగ్గురు స్నేహితుల రోజువారీ కార్యక్రమం అయింది. ఒకనాడు స్నేహితులు ముగ్గురూ కబుర్లాడు కొంటుండగా అటువైపు వేగంగా పరుగుపెడుతున్న ఒకలేడి వచ్చింది.



దాని రాక చూచి ఎలుక భయపడి పరుగునపోయి కన్నంలో దాగి తల పైకెత్తి చూడసాగింది. తాబేలు ఒక్క ఉదుటున నీటిలోకి దిగిపోయింది. కాకి కొమ్మపైకి ఎగిరి కూర్చుంది. లేడి భయంగా పరుగెడుతూ "రక్షించండి! రక్షించండి!" అని అరవసాగింది.

అప్పుడు హిరణ్యకుడు నెమ్మదిగా పైకి వచ్చి "ఏమి ఆపద వచ్చింది" అని అడిగింది. తనను వేటగాడు వెంబడించాడని తప్పించుకొని ఇటు వచ్చానని రక్షించమని లేడి కోరింది. హిరణ్యకుడు లేడితో మాట్లాడుతుండగా మంధరుడు, లఘుపతనకుడు కూడా అక్కడకు వచ్చారు. లేడికి వచ్చిన కష్టం గురించి తెలుసుకున్నారు. తమ దగ్గర ఉంటే ఎటువంటి భయం లేదని లేడిని ఓదార్చాయి.



చిత్రాంగుడు, మంధరుడు, హిరణ్యకుడు, లఘుపతనకుడు ఎంతో స్నేహంగా వుంటున్నారు. ఏ పని చేసినా నలుగురు కలసి చేసేవారు. ఏ వింతను యెవరు చూసినా ఒకరికి ఒకరు చెప్పుకునేవారు. స్నేహం ఎంత తీయనైందో వారి జీవితాలు తెలిపాయి.

నీటిలోనూ, భూమిపైన తిరిగే విచిత్ర జీవి తాబేలు. గాలిలో ఎగురుతూ

అవసరం అయినప్పుడు భూమి మీదకు దిగే పక్షి కాకి. నీటిలో మునిగితే ప్రాణం పోతుంది. గాలిలో ఎగరలేదు. కేవలం భూమిమీద మాత్రమే చెంగుచెంగున గెంతుతూ జీవించే జంతువు లేడి. అలాగే ఎలుక. వీటికి కలిసినది స్నేహమే. వీటి మధ్య అవినా భావ సంబంధం బలపడటానికి కారణం మంచితనమే.

ఒకనాడు చిత్రాంగుడు పచ్చిక మేస్తోంది. ఆహారం తినివచ్చిన మంథరుడు, మేతమేసి వచ్చిన కాకి చిత్రాంగుడి జీవిత కథను అడిగాయి. ఇంతలో హిరణ్యకుడు వచ్చాడు. అప్పుడు ఆ లేడి తన కథను యిలా చెప్పింది.

నేను నా తల్లిదండ్రులతో బంధుమిత్రులతో ఒక అడవిలో ఉండేదాన్ని హాయిగా కాలం గడిచిపోతుంది. అప్పటికి నా వయస్సు ఆరు నెలలు. ఒకనాడు మందలోనుంచి తప్పిపోయాను. దారి మరిచిపోయాను. అడవి అంతా తిరిగాను ఫలితం లేకపోయింది.

ఇంతలో వేటగాడు అటు వచ్చాడు. తప్పించుకొనే మార్గంలేదు. ఎంతో తిరిగి అలసిపోయిన నేను ఎక్కువసేపు పరుగెత్తలేకపోయాను. వేటగాడికి చిక్కిపోయాను. వాడు నన్ను ఒక రాజుగారికి బహూకరించాడు.

రాచనగరంలో నాకు బాగానే వుండేది. మంచి పచ్చిక వేసేవారు. తియ్యటి నీళ్ళు పెట్టేవారు. శుభ్రంగా పన్నీటి స్నానం చేయించేవారు. అంతఃపుర స్త్రీలు నాతో ఆటలాడేవారు. వుద్యానవనంలో తిప్పేవారు. రాజవీధిలో తిరిగినప్పుడు పిల్లలు నన్ను ముద్దాడేవారు. పచ్చిక వేసేవారు! కాలం హాయిగా గడిచిపోతోంది.

ఒకనాడు నన్ను రాజావారి భవనం బయట కట్టారు. ఆ రాత్రి వాన వచ్చింది. నాకు అడవి గుర్తుకి వచ్చింది! నా బంధువులందరూ గుర్తుకు వచ్చారు. "ఇలాంటి వర్షము వచినప్పుడు నా స్నేహితులతో వుంటే ఎంత బాగుండును" అని పైకి అన్నాను. ఆ మాటను రాజావారు విన్నారు! మనుషులు లేనిచోట ఈ మాటలు ఎలా వచ్చాయని చూశారు! అక్కడ నేను వున్నాను. ఆయన ఆశ్చర్యపోయారు.

మరునాడు పండితుల్ని పిలిచారు. "మనుష్య భాష మాట్లాడే లేడివల్ల అరిష్టమా?" అని ఆయన వారిని అడిగాడు! "అలాంటి లేడి రాచనగరంలో వుండడం మంచిదికాదు కనుక వదిలివేయమని" వారు సలహా ఇచ్చారు.

ఆ ప్రకారం రాజుగారు నన్ను వదిలివేశారు. నేను వీధులన్నీ నగరాలు గ్రామాలు తిరిగి అడవిలోకి వచ్చాను. నా వాళ్ళ జాడ తెలియదు. అడవి గాలి



స్తూన్న నన్ను వేటగాడు వెంబడించాడు.! తప్పించుకొని తిరుగుతున్న నాకు మీ ఆశ్రమం దొరికింది.

చిత్రాంగుడి మాటలు విన్న అందరూ బాధపడ్డారు. అప్పుడు మంధరుడు ఇలా అన్నాడు.

"మనలో యెవరికి యెప్పుడు ఏ ఆపద వచ్చినా ఒకరికి ఒకరం సాయం చేసుకోవాలి! వుపాయంతో అపాయాన్ని తప్పించుకోవాలి.

అందరూ అంగీకరించారు. ఒకరోజున చిత్రాంగుడు అడవికివెళ్ళి యెంత సేపటికి తిరిగిరాలేదు! మంథరుడు ఆందోళన చెందాడు. హిరణ్యకుడు బాధ



పడ్డాడు. లఘుపతనకుడు కంగారుపడ్డాడు. చాలాసేపు అవి చిత్రాంగుడి కోసం చూశాయి.

చివరకు లఘుపతనకుడు బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళాక అడవిలో వొకచోట చిత్రాంగుడు వలలో చిక్కుకొని వుండడం చూశాడు. వేటగాడు వల

పన్నాడని తాను చూచుకొనక దానిలో పడిపోయానని చిత్రాంగుడు మిత్రుడికి చెప్పాడు.

అప్పుడు లఘుపతనకుడు రివ్వున ఎగిరివెళ్ళి మంథరునకు హిరణ్యకునకు సంగతి చెప్పింది! మంథరుని సలహా ప్రకారం హిరణ్యకుని తన వీపున ఎక్కించుకుని చిత్రాంగుడు ఉన్నచోటుకు వచ్చింది. హిరణ్యకుని అక్కడదింపి ఇలా అంది.



"నీ పళ్ళతో వలను కొరుకుము. వేటగాడు వచ్చే లోపల మనం అందరం పారిపోవచ్చు."

మిత్రుని సూచన ప్రకారం హిరణ్యకుడు వలకొరికెను. చిత్రాంగుడు వల బంధమునుండి బయటపడి మిత్రులకు కృతజ్ఞతలు తెలిపెను. ముగ్గురు ఇంటికి

బయలుదేరిరి! ఇంతలో వారికి మంథరుడు ఎదురుపడెను. వారాశ్చర్యపడిరి అప్పుడు అతడిలా చెప్పాడు.

"మిత్రులారా! మిమ్మల్ని చూడాలనిపించింది. చిత్రాంగుడు పసివాడు ఆపదనుండి బయటపడి అతన్ని వెంటనే చూడాలని మనసు ఉవ్విళ్ళూరింది. అందుకే మీకు యెదురు రావచ్చునని వచ్చితిని."



మిత్రుని ఆత్రానికి, మంచి తనానికి అవి యెంతో ఆనందించాయి. నలుగురూ మాట్లాడుకొంటూ ఇంటిదారి పట్టారు. కొంతదూరం వెళ్ళేసరికి వారికి వేటగాడు యెదురుపడ్డాడు. అతడిని చూచి భయపడి కాకి చెట్టుపైకి ఎగిరి కొమ్మమీద

కూర్చుంది. ప్రక్కలో నున్న కన్నంలో దూరింది ఎలుక. లేడి చెంగున దూకి పారి పోయి పెద్ద చెట్టు చాటున దాక్కొని చూడసాగింది.

ఎటూ తప్పించుకోలేని తాబేలు మాత్రం వేటగానికి చిక్కింది, లేడి తప్పించుకుని పోయిందని బాధపడిన వేటగాడు చేజిక్కిన తాబేలును తాడుకు కట్టి బాణం కొనకు తగిలించి భుజాన వేసుకొని బయలుదేరెను.



వెనక్కి చూడకుండా వెళుతున్న వేటగాడ్ని ఎలుక, లేడి,కాకి, అనుస రించసాగాయి. తమ మిత్రుడు వేటగానికి దొరకడం పట్ల అవి యెంతో దుఃఖిం చాయి. ఎలాగయినా దానిని విడిపించుకోవాలని వాటి పట్టుదల. మూడూ ఉపాయం ఆలోచించాయి. ఒక ఎత్తువేశాయి.

ఆ ప్రకారం లేడి పరుగునవెళ్ళి వేటగానికి అల్లంతదూరాన చచ్చినట్లు పడుకుంది. కాకి దాని కొమ్ములపై కూర్చుని కన్ను పొడుస్తున్నట్లు నటించసాగింది. ఎలుకమాత్రం నెమ్మదిగా వేటగాని వెనుక నడవసాగింది.

ఎదురుగా చనిపోయిన లేడినిచూసి దానిని తీసుకువెళ్ళాలన్న తలంపుతో



వేటగాడు బాణాన్ని క్రిందపెట్టాడు. లేడి దగ్గరకు వెళ్ళాడు. ఈలోగా ఎలుక బాణానికి తాడు కొరికి తాబేలును విడిపించింది. తాబేలు గబగబా పాకి చెరువులోకి వెళ్ళిపోయింది. ఎలుక కన్నములో దూరింది. వేటగాడు దగ్గరకు రావడం చూచిన కాకి ఎగిరిపోయింది. లేడికూడా చెంగున లేచి పారిపోయింది. వేటగాడు అటు తాబేలుకోసం చూశాడు అదీ పారిపోయింది.

ఈరోజు తన ఖర్మం అలావుందని దిగులుపడి అతడు అడవి దారిన వెళ్ళి పోయాడు. వేటగాడు కనుమరుగైనాడని నిర్ధారించుకొన్న తర్వాత తాబేలు చెరువు లోంచి బయటకు వచ్చింది. కాకి చెట్టుకొమ్మ మీద నుండి దిగింది. ఎలుక కన్నం లోంచి వెలుపలకు వచ్చింది. దూరంగా పారిపోయిన లేడి కూడా నెమ్మదిగా మిత్రుల దగ్గరకు చేరింది.



మంథరుడు, లఘుపతనకుడు, చిత్రాంగుడు, హిరణ్యకుడు ఈ నలుగురూ మైత్రితో అపాయమునుండి రక్షించుకొన్నాయి. పరస్పరం సహాయం చేసుకొంటూ జీవితం గడిపాయి.

చూశారా బాలలూ! మంచి స్నేహితులుంటే ఎంతమేలు జరుగుతోందో

మరి! ఒకరికి ఒకరం సాయం చేసుకోవాలి. ఒకరితో ఒకరం మంచిగా ఉండాలి స్నేహితులకోసం ప్రాణాన్నయినా యివ్వడానికి సిద్ధంగా ఉండాలి. ఇది "మిత్ర లాభం" చెప్పే నీతి.

"మిత్రలాభం"లో ప్రధాన పాత్రలు హిరణ్యకుడు, లఘుపతనకుడు, మంథరుడు, చిత్రాంగుడు.



వీరి స్నేహబంధం కథ ఇంతవరకూ చదివాం. ఇక వీరు అప్పుడప్పుడు చెప్పుకొన్న మంచి నీతికథలు విడివిడిగా చదువుకొందాం. ఆ కథలన్నీ నీతి దాయకాలే.

# దు రా శ ప ని కి రా దు

దురాశ పనికిరాదు. దురాశ దుఃఖానికి చేటు. అంతేకాదు వొక్కొక్కసారి ప్రాణాంతకం కూడా అని హెచ్చరించే కథ. ఈ కథలో వొక పెద్దపులి, బ్రాహ్మణుని ఎలా మోసగించి చంపిందో చిత్రద్రివుడు అనే పావురం తన స్నేహితులకు చెప్పింది.



చిత్రగ్రీవుడు ఎవరోకాదు. అడవిలో వేటగాడు నూకలుజల్లి వలపన్ని వెళ్ళాక వాటిని తినాలని నేలకు వాలిన పావురాళ్ళ స్నేహితుడు. ఆ కథ ఇంతకు ముందు చదువుకున్నాం. ఇప్పుడు దురాశ ఎంత చెడ్డదో తెలుసుకొందాం.

ఒక పెద్ద అరణ్యం ఉంది. ఆ అరణ్యంలో వొక పెద్దపులిఉంది. దానికి

మనిషి మాంసం అంటే మహాయిష్టం. ఐతే ఆ ఘోరారణ్యంలో మనుష్యులు ఎక్కడనుంచివస్తారు? అందుకని అది అడవిలోని జంతువుల్ని వేటాడి తినసాగింది. కొన్నాళ్ళు జరిగాయి. అయితే పులి కోరిక తీరలేదు. ఎప్పుడు మనిషికనబడతాడా చీల్చుకొని తిందామా? అని అది వేచి ఉంది.



ఒకనాడు ఆ అడవిమార్గాన పెద్ద బ్రాహ్మణుడు ఒకడు వచ్చాడు. పులి నోరూరింది. అతడిని ఎలాగయినా చంపి తినాలని ఆలోచించింది. దాని దగ్గర బంగారు కడియం ఒకటి ఉంది. ఆ కడియం చూపి బ్రాహ్మణుణ్ని దగ్గరకు పిలవాలని పులి ఎత్తు వేసింది. మామూలుగా పిలిస్తే పులి దగ్గరకు ఎవరు వస్తారు. అందుకని అది అక్కడ ఉన్న చెరువులో దిగింది.

మునిగిపోతున్నట్లు నటించి "రక్షించండి! రక్షించండి" అని ఏడుస్తూ

## పేరాశ ప్రాణాంతకం

పేరాశ ప్రాణాంతకమని రుజువు పరచే మరొక కథ వుంది. ఒక అడవిలో ఒక నక్క ఉండేది. దానికి పేరాశ. అన్నీ తనకే కావాలని ఆశపడేది. కాని చిన్న జంతువు కావడంవల్ల దాని ఆశ తీరే అవకాశాలంతగా లేకపోయాయి.



సింహమో, పెద్దపులో వేటాడి తినగా మిగిలిన జంతువుల మాంసాన్ని తీరికగా తిని బ్రతుకు వెళ్ళబుచ్చుతోంది. ఐనా సమయం రాకపోతుందా? చక్కటి వేట దొరక్కపోతుందా? అని వేచి చూస్తున్నది. ఆ తరుణం రానే వచ్చింది.

ఒకనాడు ఒక వేటగాడు లేడిని భుజాన వేసుకొని వస్తున్నాడు!

అంతలో అతనికి అడవి పంది కనిపించింది. అది బాగా బలిసి వుంది. లేడిని ప్రక్కన పెట్టి గురిచూసి పందిపై బాణం వదిలాడు.

ఐతే బాణం కొంచెం గురితప్పి పందికి గాయమయింది తప్ప ఒక్క దెబ్బతో చావలేదు. బాణం దెబ్బతిన్న పంది కోపంతో వొక్కసారి గర్జించి వేట



గానిపై దూకి తన కోరలతో వాడి గుండెను బలంగా పొడిచింది. ఆ పోటుకు వేట గాడు చచ్చిపడిపోయాడు. కొద్దిసేపటికి పందికూడా గిలగిల తన్నుకుని చచ్చి పోయింది. దాని క్రిందపడి అక్కడే తిరుగుతున్న పాముకూడా దుర్మరణము చెందింది.

ఇదంతా పేరాశతో జీవిస్తున్న నక్కచూసింది. బలిసినలేడి, కండలు తిరిగిన పంది, పొడవైన జాతి పాము వొకేసారి ఇన్నిరకాల జంతువుల తాజామాంసం అయాచితంగా దొరకడంతో దానికి మతిపోయింది.

ఆ మూడు జంతువుల మాంసంలో ముందు దేన్ని రుచిచూడాలా అని ఆలోచిస్తుండగా దానికి వేటగాడి ప్రక్కన పడివున్న యెక్కుపెట్టిన బాణము కనిపించింది. ఆ బాణానికి నరంతో చేసిన తాడు కట్టారు. ఉప్పఉప్పగా వుండే ఆ నరాన్ని ముందుతిని తర్వాత మిగిలిన మాంసాలను తిందామనుకుంది.

వెంటనే అది నరాన్ని కొరికింది...అంతే, ఎక్కుపెట్టని బాణంకొమ్ము దాని నోట్లో దిగబడి నెత్తురు కక్కుకుని చచ్చిపోయింది. పేరాశవల్ల ఆలోచన మరచిపోయి నక్క ప్రాణాలు పోగొట్టుకుంది.

## ఎవరూ అమాయకులు కారు

ఈ ప్రపంచంలో ఎవరూ అమాయకులు కారు. ఏ పనిని స్వలాభం లేకుండా చేయరు. కొందరు తెలివిగాచేసి పట్టుపడరు. కొందరు పైకి తేలిపోతారు. వారి స్వార్థం బట్టబయలవుతుంది. ఈ నీతిని చెప్పేకథ ఇది.

వర్థమానపురమనే ఊరుంది. ఆ ఊరిలో వొక బ్రాహ్మణుడు, భార్య వుంటున్నారు. వారు అంతగా సంపద వున్నవారుకాదు. బ్రాహ్మణుడు పౌరోహిత్యం చేసి బియ్యం, పప్పు, ఉప్పులు, నువ్వులు వంటివి తెచ్చేవాడు. దాంతో వారి సంసారం నడిచేది.

వొకసారి ఆ బ్రాహ్మణుడి యింట తండ్రిగారి తద్దినం వచ్చింది. ఇంటిలో నువ్వులుతప్ప ఏమి సంభారాలు లేవు. నువ్వు పప్పుతోనే పితృకార్యం చేద్దామని బ్రాహ్మడు భార్యకు పురమాయించాడు. ఆమె నువ్వులు నానవేసి దంచి, పొట్టుతీసి కడిగి పప్పు ఆరవేసింది.

అంతలో అటుగా వొకటి రెండు కోళ్ళువచ్చి పప్పు తినసాగాయి. ఆ సమయంలో బ్రాహ్మణుడు ఇంటికి వచ్చాడు. కోళ్ళు పప్పుతినడం చూశాడు. పక్షి ముట్టి ఎంగిలిచేసిన ఆ సరుకు పుణ్యకార్యానికి పనికిరాదని భార్యను మందలించాడు

ఆ పప్పు ఎవరికైనా యిచ్చివేసి, అందుకు బదులుగా నువ్వులు తీసుకు వచ్చి మరల పప్పు చేయమని ఆజ్ఞాపించాడు! ఆ యిల్లాలు నువ్వుపప్పు తీసుకుని వొకటి రెండు యిళ్ళు తిరిగింది.

కాని పని జరగలేదు. వొకరు నువ్వులులేవన్నారు. మరొకరు నువ్వుపప్పు ఉందన్నారు. పరులయింట చేసి తెచ్చిన పప్పు మడికి పనికిరాదు కదా! అందుకని ఆ యిల్లాలు మరొక యింటికి వెళ్ళింది.



ఆ యింటివాకిలిలో నువ్వులున్నాయి. పైగా ఆ యింటావిడ అమాయకు రాలని ప్రతీతి. అక్కడ తన పని సులభంగా నెరవేరుతుందని ఆమె అనుకుని లోపలికివెళ్ళి వచ్చినపని చెప్పింది. ఆ ఇంటామె నువ్వు పప్పు సులభంగా వస్తున్నది కదాని సంతోషించి ఆ పప్పు తీసుకుని నువ్వులు ఇచ్చి పంపింది.

ఇంతలో ఆమె భర్త వచ్చి సంగతి తెలుసుకున్నాడు. తన భార్య అమాయ కత్వానికి బాధపడ్డాడు. ఆమెకు జ్ఞాన బోధ చేయాలని ఇలా అన్నాడు.

"పిచ్చిదానా! నువ్వులు నానవేసి రెక్కలు ముక్కలు అమేలా పంచి పొట్టుతీసి ఆరబెట్టి ఛాయమినపప్పును నీకు అప్పనంగా ఇచ్చి, బాగుచేయని నువ్వుల్ని ఎవరయినా ఎందుకు తీసుకువెళతారే! ఆ నువ్వుపప్పులో ఏదో దోషం ఉంటుంది.



ఇకముందు యిలాంటి పిచ్చిపనులు చేయకు, ఏ లోపం లేకుండా ఈ ప్రపంచంలో ఎవ్వరు మేలైన సరుకు ఇచ్చి నాసిరకం పదార్థం తీసుకు వెళ్ళరు."

ఆమెకు భర్తమాటలు అర్థం అయ్యాయో, లేదోకాని ఈ కథలోని నీతి లోకానికి వెలుగు చూపింది.

## జిత్తులమారి నక్క

ఇతరులను మోసం చేయాలని ప్రయత్నించినా, దానికి కష్టాలు కలిగిం లని పన్నాగాలు పన్నినా అది మనకే ముప్పు తెస్తుందని ఒక్కొక్కసారి ప్రాణ లకు ముప్పు తెస్తుందని హెచ్చరించే కథ యిది. ఈ కథను హిరణ్యకుడు తనత స్నేహం చేయాలని వచ్చిన లఘుపతనకుడికి చెప్పాడు.

కొత్తవారిని గుణదోషాలను గుర్తించక దగ్గరకు చేరదీయరాదని, చేర దీ ప్రమాదం అని కూడా హిరణ్యకుడు ఈ కథద్వారా తేటతెల్లం చేశాడు.

పూర్వం మగధ దేశంలో మందారవతి అనే అరణ్యం వుండేది. అక్క ఒక లేడి, కాకి స్నేహంగా వుంటున్నాయి.

అవి ఎంతో స్నేహంగా జీవిస్తున్నాయి. ఏ తోటలోనైనా మొక్కజొన్న కండెలు దొరికితే లేడి తెచ్చి కాకికి ఇచ్చేది. ఏ గ్రామంలో అయినా మంచి మిఠ యిలు లభిస్తే కాకి జాగ్రత్తగా తెచ్చి లేడికి పెట్టేది ఇలా అవి రెండు కష్ట సుఖాల పంచుకొని అన్యోన్యంగా వుంటున్నాయి.

మంచి పచ్చిక, పిల్లి పెసర, రొట్టెవంటి గ్రాసం దొరుకుతూండడంతో అ మేసిన లేడి బాగా బలిసింది. వొళ్ళంతా కండలు పట్టి నిగనిగలాడుతోంది. ఒకనాడ అది పచ్చిక మేస్తుండగా ఒక నక్క దానిని చూసింది బాగా బలిసిన ఆ లే మాంసం తినాలని దానికి కోరిక కలిగింది. అందుకని ఒక ఎత్తు వేసింది.

మరునాడు అదేచోట మేతమేస్తున్న లేడి దగ్గరకు నక్క వచ్చింది. దాని చూసి లేడి "ఎవరు నువ్వు? ఇక్కడకు వచ్చావేం?" అని అడిగింది.

అప్పుడు నక్క ఇలా అంది.

"ఈ అడివిలో ఆ మూల ఉండేదాన్ని, అక్కడ క్రూర జంతువుల బా పెరిగింది కనక అక్కడ వుండడం క్షేమంకాదని యిటు వచ్చాను ఇక్కడ నువ్వ కనిపించావు. పైగా ఈ ప్రాంతంలో దుష్ట జంతువులు లేవు. ఇక్కడ వుండడ మంచిది కద! నీతో చెలిమి చేస్తాను ఉండనిస్తావా?"

నక్క మాటలు నమ్మింది లేడి. ఆపదతో వుండి శరణువేడి స్నేహంకోరి వచ్చిన తోడి జంతువులను ఆదరించడం ధర్మం అనుకొని నక్కతో ఇలా అంది.

"నక్కబావా నాకు ఒక కాకి స్నేహితుడున్నాడు. మేమిద్దరం కలసిమెలసి వుంటున్నాము నువ్వుకూడా మాతో కలిసి వుండవచ్చు రా! మా ఇంటికి వెళదాం."



లేడి మాటలకు నక్క ఆనందించింది. ఇద్దరూ కలిసి కాకి దగ్గరకువచ్చారు కాకి సంగతి అడిగింది. అప్పుడు లేడి తమ కొత్త స్నేహితుడు నక్క గురించి చెప్పింది. దానిపై కాకి ఇలా అంది.

"ఇది క్రూర జంతువుల జాతికి చెందినది. పైగా జిత్తులమారి, దీనితో స్నేహం మనకు పనికిరాదు."

అందుకు లేడి ఇలా సమాధానం చెప్పింది : మిత్రమా వేరేవేరే జాతులకు చెందిన మనం స్నేహం చేస్తున్నాం కద! అలాగే ఇదీను. జాతికన్న గుణం మిన్న ఇది మంచిదని నా ఉద్దేశ్యం మనతో వుండనిమ్ము."

మిత్రుని మాట కాదనలేక కాకి అంగీకరించింది. ఆ రోజునుంచి లేడి, కాకి, నక్క స్నేహంగా వుంటున్నాయి. నక్క సమయం చూసి లేడిని చంపి మాంసం తినాలని ఆలోచిస్తుంది. ఒక ఉపాయం ఆలోచించింది ఒకనాడు తీరికగా వున్న లేడి దగ్గరకు వచ్చి "మిత్రమా ఆ ప్రక్క చక్కటి పచ్చిక వున్నది రేపు అటువైపు వెళదాం" అంది. లేడి సరేనంది.

మరునాడు ఇద్దరూ ఆవైపు వెళ్ళారు. అక్కడ పచ్చికయేకాక జొన్నచేను కూడా వుంది. లేడి మహాయిష్టంగా జొన్నకండెలు - ఆకులు తినసాగింది. రోజూ అక్కడికే వచ్చి మేత మేస్తున్నది.

రోజూ చేలోపడి ఏదో జంతువు నాశనం చేస్తున్నదని ఆ పంటచేను రైతు వలపన్నాడు. మరునాడు యధాప్రకారం లేడి మేతకు వచ్చింది. అటు ఇటు తిరిగి పచ్చిక, జొన్న మొక్కలు తింటూ వలలో చిక్కుపడిపోయింది.

తప్పించుకోలేకపోయింది. నక్క తన ఎత్తుపారిందని సంతోషిస్తూ జొన్నతోట పక్కన దాగొని చూడసాగింది.

సాయంకాలం కావస్తోంది. తన మిత్రుడు గూటికి రాకపోవడంతో కాకి ఆందోళనపడింది. ఏదైనా ఆపదలో చిక్కుకొన్నదేమోనని ఆలోచించి వెదక సాగింది, ఎగురుతూ అడవి గాలిస్తున్న కాకికి జొన్న చేను దగ్గర వలతో బిగుసుకు పోయిన తన మిత్రుడు లేడి కనిపించినది.

తన మిత్రుని విడిపించాలని ఆలోచించినది. దానికి ఒక ఉపాయం తట్టినది రివ్వున వచ్చి మిత్రుడిదగ్గర వాలింది. లేడి కాకిని చూచి ఆనందించింది అప్పుడు కాకి "మరి నక్క నిన్ను కాపాడలేదా?" అని అడిగింది. దానికి లేడి ఇలాచెప్పింది.

"నేను వలలో పడడం దానికి ఆనందం అయింది. నా మాంసం తినాలనే

ఆలోచనలో వుంది. అందుకే వలకొరికి నన్ను విడిపించమని అడిగినా అది సాయం చేయలేదు. పైగా ఇవాళ ఆదివారం నరాలతో చేసిన వలను ముట్టుకోను నేను మాంసం తినడం లేదు కదా అని వెళ్ళిపోయింది. రైతు వచ్చి నన్ను చంపితే మాంసం తినవచ్చని ఇక్కడే ఎక్కడో దాగొని వుంటుంది.



లేడి మాటలు ఎంతో బాధతో చెప్పింది. అప్పుడు కాకి "నక్క జిత్తుల మారి, దొంగ బుద్ధిని ఇప్పటికైనా తెలుసుకొన్నావు అంతే చాలు, నేను నిన్ను రక్షిస్తాను" అంది.

లేడి ఆనందించింది. ఇంతలో భుజాన కర్రతో రైతు రావడం కనిపించింది. అప్పుడు కాకి "మిత్రమా! నువ్వు ఊపిరి బిగపట్టి చచ్చిపోయినట్లు పడి

ఉండు నేను నీ కళ్లు పొడుస్తున్నట్లు నటిస్తాను. రైతు నిజంగా నువ్వు చచ్చిపోయావని భ్రమపడి వలను తీసివేస్తాడు. పూర్తిగా తీసివేయగానే "కావ్! కావ్!" అని రెండుసార్లు అరుస్తాను. వెంటనే నువ్వు పారిపో" అని ఉపాయం చెప్పింది.

లేడి కళ్ళు మూసుకుని ఊపిరి బిగబట్టి కాళ్ళు తన్ని పెట్టినట్లు పండుకుంది! రైతు వచ్చి లేడి చచ్చిపోయిందని అనుకొని వలతీసి ప్రక్కన పారవేయబోతుండగా



కాకి రెండుసార్లు "కావ్!కావ్!" అని అరచింది అంతే లేడి చెంగున పరిగెత్తింది.

వెనుతిరిగి చూసిన రైతు లేడి పారిపోతుండటం కనిపెట్టి కర్ర విసిరాడు! అది గురితప్పి గిరగిర తిరుగుతూ వెళ్ళి జొన్నచేను ప్రక్కన దాగివున్న నక్కకు తగిలింది. అది దెబ్బకు చచ్చింది!

"పొరుగువాణ్ని గోతిలో వేయాలంటే మనమే గోతిలో పడతాం" అను కొంటూ నక్క మరణించింది. కాకి ఎగిరి వెళ్ళి మిత్రుడు లేడిని కలుసుకొంది.

మిత్రుడు చేసిన సహాయానికి లేడి ఎంతో మెచ్చుకుంది. అప్పుడు కాకి "మిత్రమా! కొత్తవారిని నమ్మి ప్రాణాలు పోగొట్టుకున్న గ్రద్దకథ చెబుతా" విను అంది లేడి వింటానంది.

## గుణమా? కులమా?

లోకంలో ఒకరికొకరు మొదట కొత్తవారుగానే వుంటారు. క్రమంగా పరస్పర స్నేహమేర్పడుతుంది. అయితే ఎవరినైజం వారికి వుంటుంది. అది సమయం వచ్చినప్పుడు బయటపడుతుంది.

ఒక అవసరం కోసం అబద్ధం ఆడి, మంచితనం నటించినప్పటికీ కాల క్రమంలో చెడ్డతనం వ్యక్తం అవుతుంది. ఇది లోకసహజం. అందుకని ఆ సహజ గుణాలనుబట్టి కులాలు ఏర్పడ్డాయి. నక్క, పిల్లి వంటివి జిత్తులమారి లక్షణాలున్న దుష్ట జంతువులు, నక్క కథ ఇంతకు ముందు చెప్పుకున్నాం. ఇప్పుడు దుష్టబుద్ధి అయిన పిల్లి కథ చదువుదాం.

గంగానదీ తీరంలో ఒక పెద్ద జువ్విచెట్టు ఉండేది. దానిపై ఎన్నో రకాల పక్షులు గూళ్ళు కట్టుకొని కాపురం ఉంటున్నాయి. ఆ చెట్టు తొర్రలో ఒక ముసలి గ్రద్ద కూడా వుంది. దాని పేరు జరద్గవము. అది గ్రుడ్డిది. వేటాడి ఆహారం సంపాదించుకోలేకపోయేది. అందుకని దాన్ని చూసి జాలిపడి పక్షులన్నీ తాము సంపాదించిన ఆహారంలో దానికి పెట్టేవి. అలా అది కాలం గడుపుతున్నది.

ఒకనాడు పక్షులన్నీ ఆహార సంపాదనకు వెళ్ళిపోయాక ఆ చెట్టు పైకి పిల్లి ఒకటి వచ్చింది. దాని పేరు దీర్ఘకర్ణుడు అది బహు జిత్తులమారి.

ఎవరో చెట్టు ఎక్కుతున్న అలికిడివిని గ్రుడ్డి గద్ద "ఎవరదీ?" అని గద్దించింది. అప్పుడు పిల్లి "నాపేరు దీర్ఘకర్ణుడను పిల్లిని" అంది. దానిపైగద్ద "ఇటురాకు వచ్చావంటే ప్రాణాలు తీస్తాను" అని హెచ్చరించింది అప్పుడు పిల్లి ఇలా అంది.

"గౌరవించదగిన ఓ గద్దా! నువ్వు పెద్దదానివి. ఎన్నో సంగతులు తెలిసిన దానివి. తొందరపడి నన్ను పొమ్మనకు. నేను పిల్లిజాతి దాన్నే అయినప్పటికీ మాంసం తినని శాఖాహారిని. పుణ్యం సంపాదించాలని జీవిస్తున్నాను. నీవంటి పెద్దల వద్ద పొద్దుపుచ్చాలని వచ్చాను. నన్ను ఆశీర్వదించి వుండనియ్యి.



వినయంగా పిల్లి అన్న మాటలకు గ్రద్ద సంతోషించింది. ఆ చెట్టుపై ఇద్దరూ సత్కాలక్షేపం చేసేవారు. కొన్నాళ్ళు నమ్మకం కలిగించేటట్లు పిల్లిప్రవర్తించింది. ఆ తరువాత అది చెట్టుమీద గూళ్ళలోని పసిపిల్లల్ని తిని, ఆ ఈకల్ని, ఎముకల్ని గ్రద్ద వుంటున్న తొర్రలో పడవేసి వెళ్ళిపోయేది. గ్రుడ్డి గద్దకు ఈ సంగతులేమి తెలియలేదు.

రోజురోజుకీ తమ పిల్లలు మాయమైపోతుండడం చూసి పక్షులు ఎంతో బాధ పడ్డాయి. గద్దని అడిగాయి. తనకేమీ తెలియదని గ్రద్ద చెప్పింది.

అప్పుడు పక్షులు ఆ గ్రద్ద తొర్ర వెతికాయి. దానిలో ఈకలు, ఎముక ముక్కలు ఉండడం చూసి గ్రద్దపై కోపగించాయి. ఎంత చెప్పినా వినక అవన్నీ కలసి గ్రద్దను పొడిచి చంపాయి. పిల్లి గుణం తెలిసినా మోసపోయిన గ్రద్ద-దాన్ని



నమ్మి ప్రాణాలు పోగొట్టుకుంది. కనుక కొత్తవారి దోషాలు బాగా తెలుసుకొని స్నేహం చెయ్యాలి.

"ఇవి పంచతంత్రంలోని మొదటిభాగం అయిన మిత్రలాభంలోని కథా విశేషాలు. మంచి మిత్రుల్ని సంపాదించుకొనడం ఎంత కష్టమో ఆ స్నేహాన్ని ఎక్కువకాలం నిలుపుకోవడం అంతే కష్టం. మంచి స్నేహితులవల్ల ఎప్పుడూ మేలే కలుగుతుంది"-అని విష్ణుశర్మ "మిత్రలాభం"లో వివరించాడు.




స్నేహితులమధ్య విరోధాన్ని కల్పించి వారిని విడదీయడాన్ని "మిత్ర భేదం" అంటారు. ఇద్దరు రాజులుకలసి బల పడకుండా చేయకుండా ఇద్దరు బల వంతులు ఐకమత్యంగా వుండకుండా చూడడానికి ఈ "తంత్రం" ప్రయోగిస్తుంటారు.

ఈ కథాభాగంలో తారసపడే జంతువులు సంజీవకుడు. ఇది బలిసిన ఎద్దు. పింగళకుడు అడవికి రాజు యిది సింహం. కరటకుడు, దమనకుడు ఇవి నక్కలు పింగళకుని మంత్రికి కొడుకులు-పాటక, కాటకులు ఇవీ నక్కలే, ఇవి రాజుకు వ్యతిరేక వర్గంలోవున్న జంతువులు.

ప్రధాన కథ వీటిమధ్య జరుగుతుంది. ఆయా సందర్భాన్నిబట్టి మధ్య మధ్య నీతికథలు వస్తాయి. వాటిని తర్వాత చెప్పుకుందాం. ముందు అసలు కథ చెప్పుకుందాం.

మహిళాపురం అనే పట్టణం ఒకటి ఉండేది. అక్కడ వర్ధమానుడు అనే వ్యాపారి ఉండేవాడు. అతను ప్రక్కనగరాలకుపోయి వ్యాపారంచేసి యెక్కువ డబ్బు సంపాదించాలని ఆలోచించాడు. ఇరుగుపొరుగు నగరాలలో దొరకని ముత్యాలు, పగడాలు, కస్తూరి, పట్టుబట్టలు బండిపై వేసుకుని బయలుదేరాడు.

ఆ బండికి కట్టిన ఎడ్లపేరు సంజీవుడు, నందకుడు, అవి రెండూ మంచి యెడ్లు. చక్కగా వేగంగా నడుస్తాయి. బండి అడవి మార్గంలో ప్రయాణం చేస్తు న్నది. యెత్తుపల్లాల బాటపై ఎడ్లు కష్టంగా లాగుతున్నాయి. ఒకచోట సంజీవకుడి కాలు మడతపడి బెణికింది. కుప్పలా కూలిపోయి నడవలేకపోయాడు.

యిక ఆ ఎద్దుతో బండి నడవదని వర్ధమానుడు మరొకఎద్దును తెప్పించి బండికి కట్టుకుని ప్రయాణమై వెళ్ళిపోయాడు.

అది నెమ్మదిగా కుంటుకుంటూ పడుతూ లేస్తూ అడవిలో తిరిగింది. నాలుగు రోజులు అలా బెణుకు నొప్పితో బాధపడిన తర్వాత దానికి ఆ నొప్పి తగ్గింది. క్రమంగా ఆరోగ్యం బాగుపడింది.



ఒకనాడది అడవిలో తిరుగుతూ, ఒకచోటకువచ్చి అడవిదద్దరిల్లిపోయేలా రంకె వేసింది.

అదే సమయంలో అక్కడకు సమీపంలోని చెరువులో నీళ్ళుత్రాగటానికి వచ్చిన ఆ అడవిరాజు పింగళకుడు అనే సింహం రంకె విని భయపడింది.

అడవిలో బలంగల తననే భయపెడుతున్న ఆ శబ్దం ఎవరు చేశారు

వారెంత బలవంతులో? వారివల్ల తన పదవికి భంగంలేదుకదా! తనకన్నా బలవంతులు అడవిలో ఎవరు? వారివల్ల తన సామ్రాజ్యానికి ఎటువంటి ప్రమాదం లేదు కదా!"

ఇలా ఆలోచిస్తూ దిక్కులుచూస్తున్న పింగళకుని దగ్గరకు మంత్రి కొడుకులయిన కరటకుడు, దమనకుడు వచ్చారు. అప్పుడు దమనికుడు "రాజా! మీరలా



భయపడుతున్నారేమి? ఆ రంకెవేసినవారెవరో తెలుసుకొనివస్తాను. అతడు బలవంతుడై ధైర్యశాలి అయితే మనతో స్నేహం చేయిస్తాను. అటువంటి వారి మైత్రి రాజ్యానికిక్షేమం" అని పింగళకునకు ధైర్యంచెప్పి ఆ రంకెవినవచ్చినవైపువెళ్లాడు.

అక్కడ సంజీవకుడుబలంగా కాలిగిట్టలతో నేలనుతవ్వుతూ పౌరుషంగా

రంకెవేస్తున్నాడు. దమనుడు నెమ్మదిగా ఆ ఎద్దు దగ్గరకు వెళ్ళాడు. వినయంగా ఇలా పొగిడాడు.

"ఈశ్వరుడి వాహనం అయిన నందీశ్వరునివంటి రూపురేఖలు, పరాక్రమంగల ఓ వృషణరాజమా! నమస్కారం! నీ పౌరుషం నిన్నుచూస్తేనే తెలుస్తుంది నేను పింగళక మహారాజువారి ప్రతినిధిని. ఆయనే ఈ అడవికి రాజు,



ఆయన మీవంటి పరాక్రమవంతుల స్నేహాన్ని కోరుతున్నారు. మీరు నా వెంటవస్తే వారి వద్దకు తీసుకువెళతాను.

దమనకుడి మాటలువిన్న సంజీవకుడు ఆలోచించాడు. అనామకంగా ఆ అడవిలో తిరుగుతూ, ఏ సింహానికో, ఎర అయిపోవడంకన్నా రాజదర్బారులో చేరి, చక్రవర్తికి స్నేహితుడిగా వుండటం మంచిదని అనుకున్న సంజీవకుడు "అలాగే" దమనకుడి వెంట వెళ్ళాడు.

దమనకుడు, సంజీవకుని పేరు, పౌరుషవివరాలు పింగళకునికి చెప్పాడు. పింగళకుడు సంతోషించాడు. వారిద్దరికీ దమనకుడు స్నేహం నెరపాడు.

ఈ రోజు నుంచీ సంజీవకుడు, పింగళకుడు మంచి స్నేహంతో మెలగ సాగారు. ఏ సమస్య వచ్చినా సింహంరాజావారు సంజీవకుని సలహా అడిగేవారు. ఆ



ఎద్దు చక్కటి సలహా ఇచ్చేది దానితో ఆ గండం గడిచేది. ఇలా సంజీవకుడు రాజు గారి విశ్వాసాన్ని అభిమానాన్ని పొందాడు.

ఒక శుభముహూర్తాన సంజీవకుడ్ని ప్రధానమంత్రిగా నియమించాడు పింగళకుడు. వారి స్నేహాన్ని చూసి ఈర్ష్యపడిన కరకట, దమనకులకు సంజీవకుడు ప్రధానమంత్రి కావడం పుండుమీద కారం చల్లినట్లయింది.

తమకు దక్కవలసిన ప్రధానమంత్రి పదవిని ఆ ఎద్దు కైవసం చేసుకోవడం పట్ల అవి బాగా అసూయపడ్డాయి, కోపగించాయి. ఎలాగయినా సంజీవక పింగళకుల మధ్య విరోధం కల్పించి వాటిని విడదీయాలని ఆ ఇద్దరూ ఆలోచించారు.

సంజీవకునిపై పితూరీలు పింగళకునికి చెప్పేరు. పింగళకుని దౌష్ట్యం గురించి సంజీవకునికి చెప్పేవారు. ఇలా ఒకరిపై ఒకరికి పగ ద్వేషం కలిగించేవారు.



ఒకనాడు పింగళకుని దగ్గిరకు వెళ్ళి దమనకుడు ఇలా అన్నాడు.

మహారాజా! సంజీవకుడు బలవంతుడు, పైగా తెలివయినవాడు. ఆపై అతనికి పదవీ, అధికారం వున్నాయి. అతడు ఏనాటికయినా మిమ్మల్ని ఓడించి రాజును కావాలని ఆలోచిస్తున్నాడు. ఈ మధ్య అతను మీ శత్రువర్గం వారైన

పాటక, కాటకులనే నక్కలతో స్నేహం చేశాడు. నా మాట విశ్వసించి అతడిని శిక్షించండి.

ఈ మాటలువిని అప్పటికే సంజీవకునిపై కోపంతోవున్న సింహం గర్జించింది. "నా ఉప్పుతిని, బలిసి, నేనిచ్చిన పదవితో పెద్దవాడైన సంజీవకుడు నాకే ఎసరు పెడతాడా? అతడిని చంపివేస్తాను" అని ప్రతిజ్ఞచేసి పింగళకుడు సంజీవకుని ఇంటివైపు గర్జిస్తూ పరుగు పెట్టాడు.



సరిగ్గా అదే సమయంలో అక్కడ సంజీవకునికి కరటకుడు దుర్బోధ చేశాడు.

"సంజీవకా! బలపరాక్రమవంతుడివి. ఈ అడవి రాజ్యం నీ వశం కావాలి కాని ప్రధానమంత్రి పదవి ఏమిటి? పైగా పింగళకుడు నీపై పగపట్టి ఉన్నాడు. పాటక, కాటకులతో తిరుగుతున్నావని అతనికి కోపం. అందుకని నిన్ను చంపేయా

లని చూస్తున్నాడు, ఇకనైనా జాగ్రత్తపడు. ఇవాళే ఆ పింగళకుని చంపి రాజ్యానికి చక్రవర్తివి కమ్ము."

ఈ మాటలు సంజీవకుని తలకు బాగా ఎక్కాయి. అది కోపంతో రంకె వేసింది. గిట్టలతో నేలను తవ్వింది. "పింగళకుని యివాళే చంపుతాను" అని అరచి తోక పైకెత్తి పరుగు పెట్టింది.



మార్గంలో పింగళకుడు రావడం చూసింది. అతడు సంజీవకుడ్ని చూశాడు. ఒకరిపై ఒకరు విరుచుకొని పడ్డారు. ఇద్దరు భయంకరంగా యుద్ధం చేశారు. పింగళకుడే ముందు కిందపడిపోయాడు. ఇంతలో సింహానికి మెలకువ వచ్చింది! అది లేస్తూనే ఒక్క ఎగురు ఎగిరి సంజీవకుణ్ణి చంపింది. ఇంతకాలం తనతోనే స్నేహంగా ఉన్న మిత్రుడు ప్రాణాలు విడవటంతో మొదట పింగళకుడు సంతోషించాడు.

కాని ఇదంతా కరటక దమనకుల కుట్ర వలన జరిగిందని తెలుసుకొని బాధపడ్డాడు.

తనవంటి రాజు సంజీవకుని వంటి పౌరుషవంతుని విషయమై చెప్పుడు మాటలు వినరాదని భావించాడు!



సమఉజ్జీవులైన స్నేహితులమధ్య విరోధం కల్పించే గుంటనక్కలు ఉంటాయని వారి చెప్పుడు మాటలు వినరాదని ఈ కథ నీతి చెపుతుంది.

ఇది మిత్రభేదం ప్రధాన కథ. ఈ కథలో అంతర్భాగంగా కొన్ని చిన్న నీతి కథలున్నాయి! వాటిని విడివిడిగా చెప్పుకుందాము.

## కోతి చేష్టలు

కోతి చేష్టలంటే అక్కరలేని, మనకు కాని పనులు చేయడమని అర్థం. అలా చేయడంవలన యితరులకు హాని జరగవచ్చు! మనకూ హాని జరగవచ్చును. అందుకే తనకు మాలిన ధర్మం, మొదలుచెడ్డ బేరమేనన్నారు పెద్దలు.

ఒక అడవి వుంది. ఆ అడవిలో బోలెడు కలపవుంది. ఒక వ్యాపారి ఆ కలపను పోగుచేయించి, వడ్రంగులచేత చెక్కలు, బల్లలు, కమ్మెలు చేయిస్తున్నాడు. ఒక చెట్టుక్రింద నీడలోవడ్రంగి, తన పనివారిచేత పని చేయిస్తున్నాడు. ఆ చెట్టుపై చాలా కోతులున్నాయి. ఒక కోతి పనివాళ్ళు చేస్తున్న వడ్రంగంపనులు చూస్తుండిపోయింది.

పనివాళ్లు ఆ మానును సగంకోసి, అది చీలినచోట కలసిపోకుండా శీలలు కొట్టారు. ఇంతలో సాయంత్రం అయింది. పనివాళ్ళు ఇళ్ళకు వెళ్ళిపోయినారు. వాళ్ళు అలా వెళ్ళగా చూసి కోతులు కొమ్మలు దిగి వచ్చి అక్కడ కలప దుంగల మీదా చెక్కలమీదా యిష్టం వచ్చినట్లు ఆడసాగాయి.

ఉదయంనుంచి వడ్రంగం పనిని తదేకంగా చూస్తున్న కోతి మాత్రం



పనివారు సగంకోసి వదలిన చెక్కమీదకు ఎక్కింది. ఒక కాలును కోసిన చీలిక వద్ద లోపలకు వేసింది. రెండవ కాలును బయటకు వేలాడేసింది. కాసేపు అటు యిటు జారింది. ఆ చీలిక దగ్గర కొట్టినశీల బయటకు లాగసాగింది.

కొంతసేపు అటుయిటు గుంజేసరికి ఆ శీల ఊడి వచ్చింది. అడ్డు తొలగి పోవడంతో చీలివున్న చెక్కభాగం దగ్గరగా వచ్చింది. ఆ సందున వున్న కోతికాలు

నలిగిపోయింది. కాలును బయటకు లాగాలని కోతి నానా యాతన పడింది. కాని కాలు ఊడిరాలేదు సరికదా అది ఆ బాధకు తట్టుకోలేక చచ్చిపోయింది.



తనకుమాలిన పని చేయడం ప్రాణాంతకం అని "కోతి చేష్టలు" కథ చెప్పే నీతి, ఈ కథను కరటకుడు దమనకుడికి చెప్పాడు.

## ఆ షా ఢ భూ తి

పూర్వం దేవశర్మ అనే సన్యాసి ఉండేవాడు. అతడు చక్కటి వక్త. బాగా చదువుకొన్నాడు. గ్రామగ్రామాన తిరిగి ప్రజలకు వేదాంతా విషయాలు బోధిస్తుండే వాడు భక్తుల గాథలు వినిపిస్తుండేవాడు. పురాణ పురుషుల చరిత్రలు చెబుతుండే వాడు.

భక్తులు ఆయనకు సేవలుచేసి పళ్లు, ఫలాలు దక్షిణ తాంబూలాలు యిస్తుండే వారు. అతను ప్రసాదాలు పంచిపెట్టి తాను కొన్ని ఫలాలు సేవించి, డబ్బును మాత్రం దాస్తుండేవాడు. అలా కొన్ని రోజులు గడిచేసరికి అతని దగ్గర చాలా వెండినాణేలు చేరాయి. వాటిని అతడు ఒక బొంతలోవేసి కుట్టి దాచాడు. అతడి దగ్గర అంత డబ్బు ఉంటుందని ఎవరూ ఊహించరు.



కాని ఆషాడభూతి అనే యువకుడుఈ సంగతి కనిపెట్టాడు. ఎలాగైనా ఆ డబ్బు కాజేయాలను ఆలోచించాడు. అతడి దగ్గర శిష్యునిగాజేరి నమ్మకం కలిగించి ఆ బొంతను అపహరించుకుపోవాలని ఎత్తువేశాడు.

ఒకనాడు దేవశర్మ భక్తుల్ని పంపివేసి ఒంటరిగా వున్నాడు. ఆ సమ

యంలో ఆషాఢభూతి అతనికి దగ్గిరకు వచ్చాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. దేవశర్మ అతని వివరం అడిగాడు. అప్పుడు ఆషాఢభూతి ఇలా అన్నాడు.

"మహానుభావా! నా పేరు ఆషాఢభూతి. నేను ఈ సంసారంపై ఆసక్తి లేనివాడిని మీ సేవ చేసుకొంటూ తరించాలని వచ్చాను."

అతడి వినయానికి శ్రద్ధకు సంతోషించి దేవశర్మ అతన్ని శిష్యునిగా



అంగీకరించాడు. నాటినుంచి ఆషాఢభూతి గురువును అన్నివిధాల కనిపెట్టుకుని ఉండి సేవ చేస్తున్నాడు.

ఒకనాడిద్దరూ ప్రయాణమై మరొక గ్రామానికి వెళుతున్నారు. కొంత దూరం వెళ్ళాక ఆషాఢభూతి "గురువుగారూ! ఘోరం జరిగిపోయింది. నిన్నరాత్రి నిద్రించిన వారియింటి చీపురపుల్ల నా సంచికి అంటుకొని వచ్చింది. పరులసొమ్ము

పూచికపుల్లయినా తీసుకొనుట పాపం కనుక నేను ఇప్పుడే పదిఅంగలలో వెళ్ళి ఆ పూచికపుల్లను ఇచ్చి వచ్చేస్తాను. మీరు నడుస్తుండండి." అని కొంత దూరం వెనుకకు వెళ్ళి ఆ పూచికపుల్లలు ప్రక్కనపారవేసి వేగంగా మరలవచ్చి గురువు గారిని కలుసుకొన్నాడు. అప్పుడు గురువుగారు "నాయనా! పరద్రవ్యాపేక్ష ఏమాత్రంలేని నువ్వు నాకు శిష్యుడవు కావడం నా అదృష్టం" అని అతడిని పొగిడాడు. ప్రయాణం సాగింది.

గ్రామాలు తిరిగారు, తీర్థాలు సేవించారు. పట్టణాలు ప్రయాణించారు. ఒక రోజున యిద్దరూ అడవిమార్గంలో నడిచి వెళ్తున్నారు. ఇంతలో సాయంకాలమైంది. సంధ్యావందనం చేసుకొనే నిమిత్తం గురువుగారు తనబొంతను, ఇతర సామాగ్రిని ఆషాఢభూతికి యిచ్చి చెరువులో దిగాడు.

అదే సమయమని ఆషాఢభూతి బొంతతో పారిపోయాడు. గురువుగట్టు మీదకు వచ్చిచూస్తే అక్కడ మిగిలిన సామాను వుంది. కానిడబ్బు దాచిన బొంతతో శిష్యుడు పరారయ్యాడు. ఎంత అరచి గీపెట్టినా, యెంత గాలించినా శిష్యుని జాడ తెలియదు.

"ఆషాఢభూతివంటి నమ్మకద్రోహులు వుంటారు జాగ్రత్త!" అని ఈ కథ హెచ్చరిస్తుంది. అంతేకాదు తానొకటితలిస్తే దైవం వేరొకటి తలుస్తాదని యీ కథ సారాంశం.

దీన్ని దమనకుడు కరటకునికి చెప్పాడు. అప్పుడే తెలిసింది. పింగళక సంజీవకుల మైత్రి పెరిగి చివరకు తనకు రావలసిన ప్రధానమంత్రి పదవి సంజీవకుడు వచ్చినప్పుడు "నేనొకటి తలిస్తే దైవం వేరొకటి తలచిం"దని దమనకుడు బాధపడి యీ కథను కరటకునికి చెప్పాడు.

## ఉపాయం కథలు

ఆపదలు వచ్చినప్పుడు ఉపాయంతో వాటిని తప్పించుకోవాలి. అలాగే ఉపాయాన్ని ఆలోచించేటప్పుడు దానివల్ల మరొక అపాయంరాకుండా చూసుకోవా

లంటే అపాయానికి ఉపాయం ఎంత ముఖ్యమో వుపాయంతో అపాయంలేకుండా జాగ్రత్తపడడం అంతే ముఖ్యం. ఈ నీతిని చెప్పే కథలు కొన్ని చెప్పుకుందాం.

ఉపాయంతో ఎలాంటి అపాయాన్నైనా తప్పించుకోవచ్చు. తెలివి ఆలోచన సమయస్ఫూర్తి వుంటే చాలు శత్రువును ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీరు త్రాగించవచ్చు. అలా ఒక సింహాన్ని చంపిన చిన్న కుందేలు కథ ఇది.



ఒక అరణ్యం వుంది. అక్కడ యెన్నోరకాల జంతువులు నివసిస్తున్నాయి. వాటన్నిటికీ రాజు సింహం. అది చాలాబలమైనదీ పౌరుషంగలది. తన పంతం చెల్లాలనే పట్టుదలగలది. పైగా క్రూరమైంది. అందుచేత దానికి ఆడింది ఆట పాడింది పాటగా చెల్లిపోతుంది.

అది యిష్టము వచ్చినట్లు వేటాడి జంతువుల శవాల్ని పోగులు పెట్టేది. తిన్నంత మాంసం తిని మిగిలినదాన్ని అడవిలో చిందరవందరగా విసిరిపారేసేది. ఆ సింహం వేటకు బయలుదేరుతుందంటేచాలు అడవిలోని జంతువులన్నీ ప్రాణ రక్షణకోసం పరుగుపెట్టేవి.

సింహం యిష్టంవచ్చినట్లు మృగాల్ని చంపడంవల్ల తమ తమ జాతులు నశించిపోయే ప్రమాదం యేర్పడిందని అవి గుర్తించాయి. అందుకని అన్నీకలసి ఒక తీర్మానము చేశాయి. రోజుకు వొకరి వొంతున సింహానికి ఆహారంగా వెళ్ళాలి సింహంరాజుగా తమ యిష్టం వచ్చినట్లు యిక వేటాడటం మానివేయాలని ఆ తీర్మాన సారాశం.

ఆ సంగతినే సింహానికి తెలియజేశాయి· మృగరాజు అందుకంగీకరించింది అప్పటినుండి సింహం వేటకెళ్ళటం మానివేసింది. మృగాలు వంతులవారీగా తమ తమ కుటుంబాలనుంచి ఒక్కొక్కటి సింహానికి ఆహారంగా పంపిస్తున్నాయి. కష్టం లేకుండా నోటిదగ్గరకు ఆహారం వస్తుండడం దానికి బాగానే వుంది. జంతువులు తమవంతు ప్రకారం వేళదాటిపోకుండా మృగరాజు దగ్గరికి వెళుతున్నాయి.

ఒకనాడు చిన్న కుందేలు వంతైంది. మూడు సంవత్సరాలయినా నిండని తనకి అప్పుడే ఆయుర్దాయం చెల్లిపోయిందని అది చాలా బాధపడింది. అయితే అది మిగిలిన జంతువులవలెకాక తెలివైంది, ఆలోచించగలది. ఉపాయంతో తనకు దాపురించిన గండాన్ని తప్పించుకోవాలని అది యోచించసాగింది. దానికి ఉపాయం తట్టింది.

అన్ని జంతువులవలె కాక అది ఆలస్యంగా సింహం దగ్గరకు బయలుదేరింది. ఇక్కడ సింహం వేళదాటిపోతున్నప్పటికీ తన ఆహారానికి జంతువు రాకపోవడంతో కోపంతో గర్జించసాగింది. యింతలో కుందేలు అక్కడకువచ్చి నిలిచింది. దానినిచూసి సింహం భయంకరంగా గర్జించి ఇంత ఆలస్యం అయినదేమి" అని అడిగింది. అప్పుడు కుందేలు వినయంగా, భయం నటిస్తూ ఇలా అంది.

"మహారాజా! నేను మామూలు వేళకే బయలుదేరాను. కాని దారిలో మరొక సింహము కనిపించినది, నన్ను నిలదీసి గద్దించినది. తానే అడవికి మహారాజును అన్నది. మరొకడురాజు కాదన్నది. నన్ను తనకు ఆహారము కమ్మన్నది. నేను అతికష్టముమీద దానిని ఒప్పించి, మీ దర్శనము చేసుకొని తిరిగి వస్తానని చెప్పి ఇటు వచ్చాను.



"ప్రభూ! ఆ సింహం మిమ్మల్ని ఎంతగానో దూషించింది. మీకు పౌరుషం లేదన్నది. గాజులు వేసుకొన్న ఆడసింహం అని వెక్కిరించింది.

యీ మాటలు చెప్పి కుందేలు సింహంవైపు చూసింది. అప్పటికే ఆ మృగరాజు జూలు విదిలించి, బిగ్గరగా గర్జించి ఇలా అంది.

"ఎవడా ధూర్తుడు. ఈ అడవికి నేనే రాజును. వాడెవడో నిన్ను భయపెట్టాడు. పద! నాకు వాన్ని చూపించు. నా పంజాతో కొట్టి చంపేస్తాను."

ఈ మాటలు అని సింహము పురల గర్జించింది. ఆ పరాయి సింహం దగ్గ రకు తీసుకు వెళ్ళమని తొందరజేసింది. అప్పుడు కుందేలు నెమ్మదిగా ముందుకు నడిచింది. సింహం అనుసరించింది.

వారిద్దరూ అలా నడిచి, ఒక పాడుబడిన నూతిదగ్గరకు వెళ్ళారు. సింహము అటు యిటు చూసినది. శత్రు సింహానికై అది వెదుకుతోందని కుందేలు పసి కట్టింది. ఇక జాగు చేయడం అనవసరం అని అది ఇలా చెప్పింది.

"మహారాజా! మిమ్మల్ని వెక్కిరించి, దూషించిన ఆ సింహం ఆ నూతిలో ఉంది వెళ్ళి చంపండి.

కుందేలు మాటలు విన్న సింహం వొక్కసారి కోపంతో గర్జించింది. వొక్క ఉదుటున ఆ నూతి గట్టుమీదకు దూకి లోపలకు చూసింది.

నూతిలో మరొక సింహము కనిపించింది. ఈ సింహము గర్జించింది. ఆ సింహము గర్జించింది. ఈ సింహము పంజాపైకెత్తింది. ఆ సింహము అనాగే చేసింది. తానేంచేస్తే అదే చేస్తున్న ఆ సింహము అంటే కోపం బాగా పెరిగింది. యిక జాగు చేయరాదని నూతి గట్టుమీదనుంచి ఈ సింహము నూతిలోకి ఉరికింది.

అంతే, నీటిలో మునిగి చచ్చిపోయింది. ఆ నూతి నీటిలో తన నీడపడి మరొక సింహమువలె కనిపించినదని కోపముతోవున్న అడవిరాజు పసిగట్టలేక పోయింది.

కుందేలు పన్నిన ఉపాయము వలలో చిక్కుకొని చచ్చిపోయింది.

చిన్నకుందేలు తెలివి ఉపయోగించి, ఉపాయముతో అపాయము నుంచి బయటపడి, ప్రాణాలు కాపాడుకుంది.

## కాకి తెలివి

చక్కటి ఉపాయముతో తన కుటుంబాన్ని కాపాడుకొన్న కాకి కథ ఇప్పుడు చదువుదాము.

నర్మదా నదీతీరాన వొకచెట్టుపై కాకికుటుంబము నివసిస్తోంది. అది, భార్య పిల్లలు అక్కడ హాయిగా ఉంటున్నాయి. కాని ఆ చెట్టుక్రింద పాము పుట్ట ఒకటి వుంది. ఆ పుట్టలో పాము వుంది. కాకి దంపతులు ఆహారాన్వేషణకు వెళ్ళగానే ఆ పాము నెమ్మదిగా చెట్టుపైకి యెక్కి కాకిపెట్టే గుడ్లను తినివేస్తోంది. ఆ పాము



నుండి తమ గుడ్లను ఎలా కాపాడుకోవాలా అని అవి ఆలోచించాయి. వాటికి ఉపాయమేమీ తట్టలేదు.

చివరకు కాకి తన స్నేహితుడైన ఎలుకను ఉపాయము చెప్పమంది.

ఎలుక కూడా ఆలోచించి యేమీ చెప్పలేకపోయింది. చివరకు ఒక ఉపాయము తోచింది.

మరునాడు ఆ కాకి రాజుగారి అంతఃపురములోకి వెళ్ళింది. అక్కడ ఒక కొలనులో రాణిగారు, ఆమె స్నేహితురాళ్ళు స్నానాలు చేస్తున్నారు. వారు తమ ఆభరణాలు, బట్టలు గట్టున పెట్టారు. కాకి వారందరూ చూస్తుండగా ఒక ముత్యాల హారం ముక్కున కరచుకొని ఎగిరింది.



"కాకి ముత్యాలహారము ముక్కును పట్టుకొని ఎగురుతుంది పట్టుకోండి" అని రాణిగారు బయట కాపలాకాస్తున్న భటులకు ఆజ్ఞాపించారు. భటులు కాకిని అనుసరించసాగారు, ఆకాశములో కాకి ఎటు తిరిగితే, దాని వెంబడే భటులు నేలపై పరుగు పెడుతున్నారు.

కాకి ఎగిరి ఎగిరి వెళ్ళి తన గూడువున్న చెట్టుపై వాలి, అటు యిటు చూసింది. భటులు చెట్టుక్రింద నిలచి, పైకి చూస్తూ కాకిని అదలిస్తున్నారు.

అప్పుడు కాకి నొడుపుగా ఆ ముత్యాలహారాన్ని చెట్టు క్రింద పుట్టలో పడేటట్లు వదిలింది. ఆ హారము పుట్టలో పడిపోవడము చూసిన రాజభటులు పుట్టను తవ్వ సాగారు. కొంత త్రవ్వేసరికి పాము బయటకు వచ్చింది.



భటులు దానిని కర్రలతో బాది చంపారు. తర్వాత మరికొంత లోతు త్రవ్వగానే పుట్టలో ముత్యాలహారము కనిపించింది. భటులు దానిని తీసుకువెళ్ళి రాణిగారికి ఇచ్చారు.

కాకి తన కుటుంబానికి శత్రువైన పామును ఇలా అపాయం లేని ఉపాయంతో సులభంగా చంపగలిగింది. అందుచేత ఉపాయాన్ని మించిన తరుణోపాయం లేదు.

## ఉపాయంలో అపాయం

ఉపాయాలన్నీ మంచివికావు. ఒక్కొక్కసారి ఉపాయమే అపాయంగా మారి ప్రాణాలు తీస్తుంది. అటువంటి కథలు చెప్పుకొందాం.

ఒక చెరువులో బోలెడు చేపలు ఉండేవి. ఎన్నోరకాల పీతలు, రొయ్యలు దానిలో కాపురం చేస్తున్నాయి. వాటిని హాయిగా భోజనం చేయాలని ఒక కొంగ ఆలోచించింది. చెరువులో మెడ పైకెత్తి చూడసాగింది. తమను వేటాడి తినే పక్షి వచ్చిందని భయంతో చేపలన్నీ దూరంగా పోయాయి. తను మెడ పైకెత్తినా అవి భయపడుతున్నాయని కొంగ పసిగట్టింది. ఈసారి మరొక ఎత్తు వేసింది. మెడను నీటిలో ముంచి, ఒక కాలు పైకెత్తి తపస్సు చేస్తున్నట్టు నిలబడింది. నాలుగైదు రోజులు అలాగే గడిచాయి. చేపలకు దాని వింత ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. దాని సంగతి తెలుసుకుందామని అవన్నీ దానిచుట్టూ చేరి తిరగసాగాయి. అయినా కొంగ వాటిలో ఒక్క చేపను పట్టుకోలేదు తపస్సు చేసుకుంటూనే ఉంది. అప్పుడు చేపలు కొంగతో యిలా అన్నాయి.

"ఓ కొంగా! రుచికరమైన ఆహారంగా పనికివచ్చే మేం దగ్గరకు వచ్చినా తినవేమి? నీ ప్రవర్తన వింతగా వుంది నీ వివరం చెప్పు."

అప్పుడు కొంగ వారితో యిలా అంది.

"ఓ చిరంజీవులారా! చిన్న చేపలారా! నేను భగవంతుడి గురించి తపస్సు చేస్తున్నాను. మాంసాహారం తినడంలేదు. అందుకే మీవంకయినా చూడడంలేను."

కొంగ మాటలను చేపలు నమ్మాయి. ఆనాటినుంచి అవి కొంగ దగ్గర జేరి మంచి కథలు, కబుర్లు ఆడేవి. కొంగ వాటికి ఎన్నో సంగతులు చెప్పేది. వాటిని ఉత్సాహపరిచేది! తన మాటలు నమ్మేటట్లు మాట్లాడేది. ఇలా కొన్ని రోజులు గడిచాయి!

ఒకనాడు కొంగ దిగాలుగా ఉండటం చూసి చేపలు కారణం ఏమని అడిగాయి. అప్పుడు కొంగ కన్నీరు కారుస్తూ ఇలా అంది.

"ప్రియమైన స్నేహితులారా! అమాయక చేపల్లారా! మీకు కష్టకాలం రానున్నది. ఈ చెరువులో నీటిని తోడివేస్తారట. నీళ్ళు లేనిదే మీరెలా జీవిస్తారు? నేను ఎక్కడికైనా పోగలను. ఇన్నాళ్ళూ నా బిడ్డల్లా చూసుకున్న మిమ్మల్ని ఎలా రక్షించను అని ఆలోచించాను. ఆ కొండవతల మంచి సరస్సు ఉంది. అక్కడకు మిమ్మల్ని చేరిస్తే మంచిదనిపించింది. తర్వాత మీ యిష్టం..."

కొంగ మాటలను చేపలు విశ్వసించాయి. తమను ఎలాగయినా రక్షించమన్నాయి. అప్పుడు కొంగ ఒకమాట చెప్పింది.

రోజూ ఒకరిద్దరిని నా ముక్కున కరచుకుని వెళ్ళి ఆ సరస్సులో విడిచి వస్తాను.



చేపలు అందుకు అంగీకరించాయి. మరునాటినుంచి కొంగ శక్తికొలది ఒకటి రెండు చేపల్ని ముక్కున పట్టుకుని కొండవైపుకు వెళ్ళి ఆపైన వాటిని చంపి తిని వస్తోంది. యిలా కొన్నాళ్ళు గడిచాయి.

తమ స్నేహితులందరూ సురక్షితంగా సరస్సులో ఉన్నారని కొంగ యిక్కడి చేపలకు చెబుతూండేది. అవి ఆ మాటలు నమ్మేవి.

ఒకనాడు ఎండ్రకాయ వంతు వచ్చింది! అది కొంచెం తెలివయినది. కొంగ ముక్కున కరుచుకుంటే ఎక్కడ తనను 'గుటకాయస్వాహా' చేస్తోందోనని దానికి అనుమానం వచ్చింది! అందుకని యిలా అంది. "కొంగ గురువుగారూ!" మీరు పెద్దలు, పుణ్యాత్ములు! మాంసాహారం ముట్టని సదాచారులు కదా! నేను కంపుకొడుతుంటాను. పైగా అల్పజీవిని. మీరు నన్ను నోటితో పట్టుకొనడం నాకు

యిష్టంకాదు. ఆ రకంగా మీ వ్రతాన్ని భగ్నపరచడం పాపం. కనుక నేను మీ మెడను నా కొండీలతో పట్టుకుంటాను ఎగిరిపొండి!"

ఎండ్రకాయ మాటలకు కొంగ పొంగిపోయింది. అది తనను పొగిడినందుకు ఆనందించింది. "అలాగే పట్టుకో" అని మెడ చాచింది. ఎండ్రకాయ కొంగ మెడను వొడుపుగా పట్టుకుంది. చేపమాంసం తిని మొహం మొత్తిన కొంగ ఎండ్రకాయ మాంసాన్ని తినవచ్చునన్న ఆశతో వేగంగా పైకి ఎగిరి కొండశిఖరం వైపు పయనించింది.



ఇక కొండశిఖరంమీద కొంగ దిగటానికి సిద్ధపడుతోంది. అప్పుడు ఎండ్రకాయ అటు యిటు చూసింది. అక్కడ సరస్సు ఏమీ కనిపించలేదు. పైగా కొండ మీద చేపల పొలుసులు, ఎముకలు కనిపించాయి.

ఇన్నాళ్లు కొంగచేసిన మోసం ఎండ్రకాయకు అర్థమయింది. తీపి మాటలు చెప్పి కొంగ చేపల్ని మోసగించి చంపి తిందని తననుకూడా భక్షిస్తుందని ఎండ్రకాయ తలచింది.

ఇంతలో కొంగ కొండపైన వాలసాగింది. ఆలస్యంచేస్తే లాభంలేదని ఎండ్రకాయ తన కొండీలతో కొంగ మెడను బలంగా నొక్కి చంపింది.

కొంగప్రాణాలు కోల్పోయి కొండమీద పడింది. ఎండ్రకాయ నెమ్మదిగా కొండ దిగి చెరువు దగ్గరకు చరచర పారిపోయింది.

పాపం కొంగ చేపల్ని చంపడానికి ఆలోచించిన ఉపాయం చివరకు దానికే అపాయంగా పరిణమించింది. అందుచేత ఉపాయం ఆలోచించేటప్పుడు దానివల్ల కలిగే ప్రమాదాలు కూడా యోచించాలని ఈ కథ నీతి.



## వెర్రికొంగలు

ఉపాయంవల్ల వచ్చే అపాయం గురించి ఆలోచించలేక కుటుంబమును పణంగా పెట్టిన వెర్రికొంగ కథ చెప్పుకుందాము.

ఒక అడవిలో ఒక చెట్టుపై కొంగ దంపతులు కాపురం వుంటున్నాయి. ఆ చెట్టు క్రింద పుట్టలో పాము వుంది. అది చెట్టు ఎక్కి కొంగ గ్రుడ్లను, పిల్లల్ని

తినేసేది. తమ పిల్లల్ని రక్షించుకోవడం యెలాగాని ఆలోచించిన కొంగ ఒకయెత్తు వేసింది.

అక్కడి సమీపంలో ఒక ముంగిస వుంటున్నది. పాముకు ముంగిసకు విరోధం కదా పాముని చంపడానికి ముంగిసను ప్రయోగించాలని కొంగ ఆలోచించింది.



ఒకరోజున కొంగ చేపల్ని వేటాడి ముంగిస ఇంటి దగ్గరనుంచి పాము పుట్ట వరకూ వరుసగా వేసింది! తాను వెళ్ళి చెట్టుపై కూర్చుంది. ఇక్కడ ముంగిస ఇంటిలోనుంచి బయటకు వచ్చి చేపలు వరుసగా పడివుండటం చూసింది. మంచి ఆహారం దొరికినందుకు సంతోషించి ఒక్కొక్క చేపనేతింటూ పుట్టదగ్గరకి చేరింది. సమయం చూసి చెట్టుపైన కూర్చున్న కొంగ తన నోటిలో మిగిల్చిన చేపను పుట్టలోకి జారవిడిచింది పుట్టలోవున్న పాము ఆ చేపను చూసి బుస్సుమని పుట్టపైకి వచ్చింది.

అక్కడేవున్న ముంగిస పామును చూడగానే "బుస్సు" మని మీదకి దూకింది. రెండూ కొద్దిసేపు పోరాడాయి. చివరకు ముంగిస పామును రెండు ముక్కలుగా కొరికి చంపేసింది. చెట్టుపై కూర్చున్న కొంగ తన శత్రువయిన పాము చచ్చిపోయిందని సంతోషించింది.



అయితే ముంగిస చెట్టుపైకి చూసింది. పైన గూళ్ళలో కొంగ గ్రుడ్లు పిల్లలు ఉండడం కనిపించింది. మంచి మాంసం దొరికిందని సంతోషించి ముంగిస చెట్టుపైకి యెక్కి గ్రుడ్లును, పిల్లల్ని తిని వెళ్ళిపోయింది.

శత్రువు మరణించాడన్న సంతోషం తమ పిల్లల్ని ఫణంగా పెట్టుకున్నా మన్న దుఃఖం వెర్రికొంగ దంపతులకు కలిగాయి. ఉపాయంలో దాగిన అపాయాన్ని కూడా గుర్తించాలని ఈ కథ చెప్పేనీతి.

## లౌక్యం తెలియని ఒంటె

మంచితనము శ్రేయస్కరమే కాని లౌకికజ్ఞానంలేని మంచితనం మంచిది కాదు! పైగా దుష్టులతో చేరితే ఆ మంచితనమే ప్రాణాలు తీస్తుంది. సముద్రంలో కలిసిన నదీజలాలుకూడా ఉప్పగా మారిపోయిన విధంగా దుష్టబుద్ధి గలవారితో చేరితే మంచివారికి చేటు తప్పదు! ఈ నీతి చెప్పే కథ ఇది.

ఒక అడవిలో సింహంరాజు దగ్గర నక్క, కాకి, పులి పనిచేస్తుండేవి అవి మంచివికావు. కాని మంచితనాన్ని నటించేవి. ఒకనాడు అడవిలో బాగాబలిసిన ఒంటె ఒంటరిగా తిరుగుతూ కనిపించింది. అవి దాని దగ్గరకువచ్చి "నువ్వుఎక్కడి



దానవు? యిక్కడకు వచ్చావు?" అని ఆరా తీశాయి. అప్పుడు ఆ ఒంటె యిలా సమాధానం చెప్పింది.

"స్నేహితులారా! నేను ఈ ప్రక్క గ్రామం నుంచి వచ్చాను. మా యజమాని నన్ను నానా బాధలు పెడుతున్నాడు అనుభవించలేక ఇక్కడకు వచ్చి పది

పేను రోజులయింది. ఆహారం బాగానే దొరుకుతుంది, కాని మంచి స్నేహితుల కోసం తిరుగుతున్నాను.

ఒంటె మాటలు విని నక్క, కాకి, పులి సంతోషించాయి. అది మంచిదని అవి దానితో స్నేహం చేయాలనుకున్నాయి. తమతో రమ్మని తీసుకువెళ్ళాయి. తమ రాజుగారిని దానికి పరిచయం చేశాయి. ఒంటె మంచితనాన్ని సింహం రాజా వారు యెంతో మెచ్చుకున్నారు.



క్రమంగా వారిద్దరి స్నేహం పెరిగింది. సింహానికి ఒంటె తెలివితేటలపట్ల విశ్వాసం పెరిగినది. నమ్మకము కుదిరినది. దానిని రాజ్యానికి ప్రధానమంత్రిగా నియమించింది. ఇది పులికి, నక్కకు, కాకికి ఈర్ష్య కలిగించింది. ఇన్ని సంవత్సరాలుగా కొలువులో వున్న తమకు ఆ పదవి రాక కొత్తగా చేరిన ఒంటెకు ఆ గౌరవం దక్కడంవల్ల అవి అసూయ చెందాయి. ఎలాగయిన ఒంటెకు హాని చేయాలని ఆలోచించాయి. సమయము కోసము వేచి వున్నాయి.

ఒకసారి సింహానికి జబ్బుచేసి అది కదలలేని పరిస్థితి ఏర్పడింది. అప్పుడు నక్క, కాకి, పులి జంతువుల్ని వేటాడితెచ్చి సింహానికి ఆహారంగా యిచ్చేవి. ఒక లాడు వాటికి వేట దొరకలేదు. యెంత తిరిగినా చిన్న జంతువుకూడా లభించలేదు అవి దిగాలుగా రాజుదగ్గరకు వచ్చాయి.

కాకి తనను తినమన్నది. అప్పుడు సింహము "నిన్ను తింటే నా ఆకలి తీరదు" అంది. అప్పుడు నక్క తనను భక్షించమన్నది. సింహము దానికి అదే సమాధానం చెప్పింది. అప్పుడు పులి తనను ఆహారంగా తినమని కోరింది. దానిపై సింహం "ఓ పులీ! నువ్వు యెందరో అమాయకులను చంపితిన్న పాపాత్ముడివి. నిన్ను నేను భక్షించను. ఇలా ఆకలితో మరణించినా ఫర్వాలేదు" అని దిగాలుగా చూసింది.

అప్పుడు ఒంటె రాజుగారి దగ్గరకు వచ్చి "మహాప్రభూ! నాది పెద్ద శరీరం. బోలెడు మాంసం ఉంటుంది, నన్ను తినండి" అని కోరింది. అందుకు సింహము అంగీకరించింది. వెంటనే పులి ఒంటెమీదకు దూకి చంపింది. సింహం ఆ మాంసాన్ని తిని ఆకలి తీర్చుకొన్నది.

పులి, నక్క, కాకి లౌక్యంతో ఈ పన్నాగం పన్నాయని తెలుసుకొనలేక ఒంటె మంచితనము వల్ల ప్రాణాలు పోగొట్టుకుంది. దుష్టులు మంచివారి ప్రాణాలను కూడా తీయడానికి వెనుకాడరని ఈ కథ నీతి.

## దుష్టబుద్ధి

ఇతరులకు హాని తలపెడితే అది మనకే హాని అవుతుంది. అపాయము గురించి ఆలోచించక ఎత్తువేసిన అది వారికే చిత్తు చేస్తుంది. ఇందుకు దుష్టబుద్ధి కథే నిదర్శనము, ఆ కథ తెలుసుకొందాము :

పూర్వము ఒక గ్రామములో దుష్టబుద్ధి, సుబుద్ధి యిద్దరు మిత్రులు ఉండేవారు. దుష్టబుద్ధి అంటే చెడు ఆలోచన గలవాడని, సుబుద్ధి అంటే మంచి మనసు కలవాడని అర్థము. వారి పేర్లకు తగినట్లే వారి నడవడి ఉండేది.

ఒకసారి యిద్దరూ పొరుగున ఉన్న పట్టణానికి వర్తకానికై బయలు దేరారు. మార్గములో వారికి బంగారు నాణాలు వున్న ఒంటె దిండెలు దొరికాయి. వాటిని తీసుకొని యిద్దరూ వెనుదిరిగారు. ఆ ధనాన్ని సమానముగా పంచుకుందామని ఇద్దరూ నిశ్చయించుకున్నారు. అయితే పగటిపూట వాటిని వూరిలోనికి తీసుకెళ్ళడము యిష్టములేక వూరి చివర చెట్టుక్రింద పాతి, యిళ్ళకు చేరారు. తర్వాత

ఒకనాడు రాత్రివచ్చి ఇద్దరు ఆ ధనాన్ని తీసుకువెళ్ళవచ్చునని సంకల్పించు కొన్నారు. ఎవరి యిళ్ళకు వారు వెళ్ళిపోయారు.

అయితే దుష్టబుద్ధికి ఆశ పెరిగింది. ఆ బంగారు నాణాలను తానే తీసు కోవాలని అనుకున్నాడు. అందుకని ఆ రాత్రి చెట్టు దగ్గరకు రహస్యంగా వెళ్ళి బిందెలను తీసుకొని యింటిలో దాచుకొన్నాను. కొన్ని రోజులు గడిచాయి.



ఆ సంగతి తెలియక సుబుద్ధి ఒకనాటి రాత్రివచ్చి "మిత్రమా! ఆ చెట్టు క్రింద పాతిపెట్టిన బిందెలను తెచ్చుకుందాం రా" అన్నాడు. దుష్టబుద్ధి "సరే" అని మిత్రుని వెంట బయలుదేరాడు. ఇద్దరు చెట్టుక్రిందకు చేరి త్రవ్వారు. ఎంతత్రవ్వినా, ఎక్కడ త్రవ్వినా వారికి బిందెలు కనిపించలేదు. అప్పుడు దుష్టబుద్ధి సుబుద్ధిని యిలా నిందించాడు.

"మిత్రద్రోహి! ఇక్కడ నిధిని పాతి పెట్టినట్లు మనకిద్దరికి తప్ప వైవారికి

తెలీదు. నువ్వే రహస్యముగా వచ్చి బిందెలు తీసుకొనిపోయి వుంటావు. నీ దొంగ తనము బయటపడరాదని యిలా నాటకము ఆడుతున్నావు."

మిత్రునికి సుబుద్ధి ఎంత చెప్పినా వినలేదు. పైగా రెచ్చిపోయి దుర్భాష లాడాడు. నిందించాడు. అప్పుడు సుబుద్ధి విసిగి "నీ యిష్టము వచ్చినట్లు చేసుకో! దైవమే సాక్షి నేను యే పాపము యెరుగను" అని యింటికి వెళ్ళిపోయాడు.

తరువాత దుష్టబుద్ధి రాజుగారికి ఫిర్యాదు చేశాడు. రాజు ఇద్దరు చెప్పినది సావధానంగా విని సుబుద్ధే ఆ ధనాన్ని తీశాడని సాక్ష్యమేమిటి అని అడిగాడు. అప్పుడు దుష్టబుద్ధి "నిధిని పాతినచోట ఉన్న చెట్టే సాక్ష్యము చెపుతుంది రేపు విచా రించవచ్చు" అన్నాడు. రాజుగారు అందుకు సమ్మతించారు.

దుష్టబుద్ధి యింటికి వచ్చి ముసలి తండ్రిని పిలిచి రాజుగారి కొలువులో జరిగిన సంగతి వివరించి "తండ్రీ! నువ్వు ఆ చెట్టు తొర్రలో దాక్కొని రాజుగారు వచ్చి సాక్ష్యము అడిగినప్పుడు సుబుద్ధి ధనాన్ని అపహరించాడని చెప్పు" అని బోధ చేసి పంపాడు. ఆ ముసలాయన అలాగే అన్నాడు.

మరునాడు సుబుద్ధి, దుష్టబుద్ధి, రాజుగారు, కొందరు భటులు కలసి ఆ చెట్టు దగ్గరకు వెళ్ళారు. రాజు చెట్టునుచూసి "ధనమువున్న బిందెలున ఎవరు అపహ రించారో చెప్పు" అని ప్రశ్నించారు.

అంతక్రితమే చెట్టుతొర్రలో దాగిన దుష్టబుద్ధి తండ్రి లోపలనుండి "బంగారు నాణాలున్న బిందెలను సుబుద్ధి అపహరించాడు" అని సాక్ష్యము చెప్పాడు. తన ఎత్తు పారినదని దుష్టబుద్ధి సంతోషించసాగాడు.

"కాని చెట్టు మాట్లాడటమేమిటి? నమ్మశక్యము కాకుండా వుంది" అని రాజుగారు అక్కడ ఎండుగడ్డిని తొర్రలో వేయించి మంట పెట్టించాడు. ఆ వేడికి పొగకు వోపిరాడక లోపల నక్కికూర్చున్న దుష్టబుద్ధి తండ్రి బిగ్గరగా కేకలు వేస్తూ తొర్రలో నుండి బయటపడ్డాడు.

అప్పుడు రాజుగారు ఆ ముసలివాణ్ని పట్టుకొని సంగతేమిటని ప్రశ్నిం చారు. అతను దుష్టబుద్ధి ద్రోహచింత గురించి రాజుగారికి వివరించి "ఆ బంగారు నాణాలున్నబిందెను దుష్టబుద్ధే అపహరించి తమ ఇంటిలో దాడాడని" చెప్పాడు.

రాజు భటులను పంపి దుష్టబుద్ధి ఇంటినుంచి బంగారు నాణాలున్న బిందె లను తెప్పించి బుసుద్ధికి యిప్పించాడు. మిత్రద్రోహముచేసి దొంగతనానికి అబద్ధా నికి పాల్పడిన దుష్టబుద్ధికి శిక్ష విధించాడు.

పరులకు హాని చేయాలని గోయితీస్తే ఆ గోతిలో మనమే పడతాము. దూర దృష్టి లేకుండా ఎత్తులువేస్తే అవి మనల్నే చిత్తుచేస్తాయి అని ఈ కథ మనకు హెచ్చరిక చేస్తుంది.



## మూర్ఖులు

ఈ ప్రపంచములో ముఖ్యముగా మూడురకాల మనుష్యులుంటారు వారు స్వయముగా ఆలోచించగలరు. ఎవరైనా చెప్పితే వినేవారు. ఆలోచించని వారు చెప్పితే విననివారు. వారిని మూర్ఖులంటారు. ఇసుకనుంచి నూనె తీయగలరేమో కాని మూర్ఖులకు చెప్పి ఒప్పించలేము పైగా అలా చెప్పడమువల్ల వారు యెదురు తిరిగి మనకే ఆపద తలపెడతారు.

అటువంటి మూర్ఖుల కథలు తెలుసుకుందాము. ఒక అడవిలోకి కొన్ని హంసలు, తాబేలు స్నేహముగా ఉంటున్నాయి. ఆ తాబేలు పేరు కంచుగ్రీవుడు

చెరువులోనూ చెరువు గట్టుమీద కూడా తిరుగుతూండేది. హంసలు కూడా చెరువులో ఈదుకుంటూ తామరకాడలు తిని, తీరిక వేళల్లో గట్టుమీద గంతులు వేస్తుండేవి. ఇలా చాలాకాలం గడిచింది.



ఒకసారి ఆ ప్రాంతంలో తీవ్రమైన దుర్భిక్షం ఏర్పడింది. చెరువు ఎండి పోసాగింది. అప్పుడు హంసలు ఆ చెరువును వదలిపోవాలనుకున్నాయి. తాబేలును కూడా తమతో తీసుకువెళ్ళాలనుకున్నాయి. నేలమీద పాకివస్తే చాలా రోజులు పడు తుంది. పైగా ప్రమాదము కూడా. అందుకని ఒక ఉపాయము ఆలోచించాయి.

తామిద్దరూ ఒక కర్రపుల్లను అటు ఇటు ముక్కునకరచి పట్టుకుంటామని మధ్యన తాబేలు ఆ కర్రను నోటితో పట్టుకోవాలని అప్పుడు ఆకాశమార్గాన ఎగిరి వెళ్ళిపోవచ్చునని అవి తాబేలుకు చెప్పాయి. తాబేలు అందుకు అంగీకరించింది.

బయలుదేరే ముందు హంసలు తాబేలును యిలా హెచ్చరించాయి "మిత్రమా! మార్గములో పల్లెలు, పట్టణాలు వస్తాయి. ఆకాశములో వెళుతున్న మనల్నిచూసి క్రింద జనము కేకలు వేస్తారు తప్పట్లు కొడతారు నువ్వు మాత్రము నోరు తెరవవద్దు, అలా తెరిస్తే క్రిందపడి చచ్చిపోతావు."

మిత్రుల హెచ్చరికను విన్న తాబేలు అలాగే అని చెప్పి కర్రపుల్ల మధ్యభాగాన నోటితో పట్టుకుంది. హంసలు రెండు అటు ఇటు ఆ పుల్లను తన ముక్కులతో కరుచుకొని ఆకాశానికి ఎగిరాయి. అవి రివ్వున ఎగిరిపోతుంటే తాబేలుకి క్రింద చెట్లు, చేమలు, ఇళ్ళు, సెలయేళ్ళు తమాషాగా కనిపిస్తున్నాయి.




అలా పయనించి, పయనించి ఒక పట్నముమీదుగా ఎగురుతున్నాయి. ఆ నగరములోని పిల్లలు ఆకాశముపైపు చూసి "ఎంత విచిత్రము! తాబేలు ఆకాశములో ఎగురుతుంది" అని బిగ్గరగా కేకలువేస్తూ గోలచేయసాగారు.

తాబేలుకు ఆత్రము పెరిగింది. ఆ పిల్లలు ఏమని అంటున్నారో తెలుసు కోవాలనుకుంది. ఆ తొందరలో హంసలు చెప్పినసంగతి మరిచిపోయింది. "వాళ్ళేమిటనుకున్నారు" అని అడగాలని నోరు తెరవగానే నేలమీద పడిపోయి

మరణించింది. ఇది మూర్ఖత్వము కాక మరేమిటి? ఇక్కడ తాబేలు తన మూర్ఖత్వము వల్ల మరణించింది కాని మూర్ఖులైన కోతులకు సలహాచెప్పి వాటి చేతుల్లో చచ్చి పోయిన పక్షి ఒకటి వుంది.



దాని పేరు సూచీముఖము. అది చిన్న పిట్ట. చాలా తెలివైనది. అడవి పళ్ళు ఫలాలుతిని హాయిగా జీవిస్తోంది. అది వుంటున్నచోటే ఒక చెట్టుపై కొన్ని కోతులు ఉంటున్నాయి.

అది చలికాలం. కోతులకు చలి కావాలనిపించింది- అయితే వాటికినిప్పంటే ఏమిటో తెలియదు. కాని మంటవల్ల వేడిపస్తుందని దానితో చలి కాగవచ్చునని వాటికి తెలుసు.

అందుకని అవి ఆ చుట్టుప్రక్కల తిరుగుతున్న మిణుగురు పురుగుల్ని తెచ్చి ఒకచోట గుట్టగాపోసి చుట్టూచేరి చలికాగుతున్నట్టు కూర్చున్నాయి.

వాటి అమాయకత్వానికి నవ్వుకుని సూచీముఖుడు అక్కడకువచ్చి కిచకిచ లాడి ఇలా అన్నాడు:

"మిత్రులారా! అవి మిణుగురు పురుగులు. మంటలు కావు. వాటివల్ల మీ చలి తీరదు. వెళ్ళి కట్టెపుల్లలు తెచ్చి వెలిగించుకోండి మంచి మంట వచ్చి మీ చలి పోతుంది.

తాము అడగకుండా సలహా ఇస్తున్న సూచిముఖుని చూసి కోతులు కోపగించి దానికి ఏమీ తెలియదని నిందించి, తమకే అన్నీ తెలుసునని దానిమెడ పట్టుకొని చంపేశాయి.

కనుక మూర్ఖులకు మంచి చెప్పడం కూడా ప్రమాదమే అని ఈ కథ చెబుతుంది.

## మూడు చేపలు

మూర్ఖత్వంతో మరణించిన ఒక చేప కథ ఇది. ఒక చెరువులో మూడు చేపలు స్నేహంగా ఉంటున్నాయి. వాటిపేర్లు దూరదర్శి, కుశాగ్రబుద్ధి, మందబుద్ధి, దూరదర్శి పేరుకు తగినట్లు మంచిచెడ్డలను ముందుగానే ఊహించి తగిన నిర్ణయాలు తీసుకొన్నది. మందబుద్ధికి తెలివిలేదు. అలా అని ఎవరు చెప్పినా వినదు. తనకు తోచినదే వేదం అనే మూర్ఖత్వం ఆ చేపది.

ఇలా ఉండగా ఒకనాడు దూరదర్శి హడావుడిగా వచ్చి స్నేహితులు యిద్దరికీ ఇలా హెచ్చరిక చేసింది.

"మిత్రులారా! మనకు ఆపద వచ్చింది. రేపు ఈ చెరువులో వలలువేసి చేపలు అన్నింటినీ పట్టుకోవాలని జాలర్లు ఆ ఒడ్డున నిలబడి అనుకొంటుండగా నేను విన్నాను. మనం ఈ రోజే ఎక్కడికైనా వెళ్ళిపోయి ప్రాణాలు రక్షించు కొందాం.

కుశాగ్రబుద్ధి, మందబుద్ధి దాని మాటలు వినలేదు. పైగా దూరదర్శి అబద్దాలు చెపుతున్నదని నిందించాయి. దూరదర్శి "వాటి ఖర్మానికి" వాటిని వదలి వేరే చెరువులోకి వెళ్ళిపోయింది.

మరునాడు జాలరు వచ్చారు. వలపన్నారు. కుశాగ్రబుద్ధి, మందబుద్ధి వలలో చిక్కుకున్నారు. తమ స్నేహితుడు చెప్పిన మాట వినలేదని కుశాగ్రబుద్ధి చాలా దుఃఖించాడు. అయినా ఉపాయం ఆలోచించాడు.

వలల్ని లాగి చేపల్ని గట్టున వేశారు జాలర్లు. అప్పుడు కుశాగబుద్ధి ఊపిరి బిగబట్టి చచ్చిపోయినట్లు పడివుంది. వలలో చచ్చిపోయిన చేపల్ని జాలర్లు ప్రక్కన చేరవేశారు కొనప్రాణంతో గిలగిలలాడుతున్న చేపల్ని మాత్రం బుట్టలలో వేసుకొన్నారు. ఏ ఉపాయం తెలియని మందబుద్ధి చేప జాలర్లకు చిక్కి చచ్చి పోయింది.



గట్టునపడిన చేపలలో ఊపిరి బిగబట్టిన కుశాగ్రబుద్ధి మాత్రం సమయం చూసి ఒక్కగెంతు నీళ్ళలోకి దూకి ప్రాణాలు కాపాడుకుంది.

స్నేహితుల మాట వినక మూర్ఖత్వంతో ఉంటే ప్రాణాలు పోతాయి అని హెచ్చరిక చేసే నీతి కథ ఇది.

## భయం మంచిది కాదు

భయం మంచిదికాదు. పిరికివాడు ఈలోకంలో దేనినీ సాధించలేడు ధైర్యంవల్లనే యే పనైనా సానుకూలం అవుతుంది. మంచి ఫలితాలు వస్తాయి! చిన్న శబ్దంవిని భయపడితే పెద్ద పెద్ద రాచకార్యాలు ఎలా సాధించగలం.

సంజీవకుడు అరణ్యంలో యెక్కడో దూరంగా వేసిన రంకె విని పింగళ సింహరాజు భయపడినప్పుడు కరటక, దమనకులు కొన్ని మాటలుచెప్పి రాజుకి ధైర్యం కలిగించారు. పైగా ఒక మంచి కథ చెప్పారు. అదే "నక్క-భేరి" కథ.

అడవిలో ఒక నక్క ఉండేది. దానికి రకరకాల మాంసములు తినడం అంటే మహా ఇష్టం. తెలివిగా ఆయా మాంసాలు తింటూండేది. నక్క స్వయంగ పెద్ద జంతువుల్ని వేటాడలేదు! అందుచేత ఏ సింహమో, పెద్దపులో వేటాడి తిని వదిలేసిన మాంసాన్ని తింటుంది. అలాగే రకరకాల జంతువుల మాంసాలను తినేది ఐనా ఏనాడు పులి యెదుటకాని, సింహం యెదుటకాని పడలేదు. అవంటే దానికి భయం. అలా నక్క కాలం వెళ్ళబుచ్చుతోంది.

ఒకసారి ఆ అరణ్యం దగ్గరలో పెద్ద యుద్ధం జరిగింది. ఎన్నో గుఱ్ఱాలు, ఏనుగులు యుద్ధంలో చచ్చిపోయాయి. ఎందరో మనుష్యులు నేలకూలారు. రక్తం ఏరులై ప్రవహించింది. మాంసం ముక్కలు ఆ యేటిలో తేలియాడుతున్నాయి. యుద్ధం అయిపోయింది. సైన్యాలు వెళ్ళిపోయాయి. అంతా నిశ్శబ్దం పీనుగు పెంటలు దుర్వాసనలు మాంసం కుళ్ళుతున్న చెత్తవాసన! రక్తం గడ్డకట్టిన చమ్మ వాసన.

నక్కకు ఆ వాసన ఆనందప్రదమైంది. ఏనుగులు మాంసం, గుఱ్ఱాల మాంసం, మనుష్యుల మాంసం రక్తపుగడ్డలు హాయిగా తినవచ్చని సంబరపడింది. తీరికగా ఆ ప్రాంతానికి వచ్చింది. అక్కడంతా భయంకర దృశ్యం! చెట్ల మధ్య మానవ కళేబరాలు, పశువులు, అస్థిపంజరములు నెత్తుటి మడుగులు.

ఇంతలో దానికి "గర గర" అనే శబ్దం భయంకరంగా వినిపించింది. అదేదో క్రూరజంతువు కోపంగా అరిచినట్లు భయపడింది. నక్క ఒకకొండ ప్రక్క దాగి కొంతసేపు చూచింది. శబ్దము వినిపిస్తుంది. కాని యెవ్వరూ కనిపించడంలేదు. యే జంతువు అటుగారాలేదు.

భయపడితే తన కోరిక తీరదని నక్క నెమ్మదిగా అటు రాసాగింది. అటు ఇటు చూస్తుంది. ఏ శత్రు జంతువైనా తనపైదూకి, ప్రాణాలుతీయకుండా అతి జాగ్రత్తగా నడవసాగింది ఆ ధ్వని మరీ ఎక్కువగా "గర్! గర్" మని వినిపిస్తోంది. నక్క ఈసారి ఒక చెట్టుచాటున నిలబడి గుట్టూ చూసింది. మనుష్య సంచారంలేదు. జంతువుల అలికిడిలేదు. మరి ఈ ధ్వని ఎచటనుంచి వస్తుంది. దానికి అంతుపట్టటంలేదు. బాగా ఆలోచించింది వెదురు పొదలు ఉన్నాయేమోనని చూసింది. అక్కడ అటువంటి పొదలులేవు.

వెదురు బొంగులకు తుమ్మెదల రంధ్రాలు చేస్తాయి. ఆ చిల్లులోనికి గాలి ప్రసరించినపుడు సన్నని శబ్దం వస్తుంది. కాని అక్కడ అటువంటి వెదురు డొంకలు ఏమీలేవు. కనుక అది వాటి ధ్వనికాని మరి ఈ ధ్వని ఎచట నుండి వస్తోంది.



నక్కకు భయంపోయింది. ధైర్యం తెచ్చుకొన్నది. వేగంగా ముందుకు వెళ్ళి చూచింది. అక్కడ క చెట్టుక్రింద పెద్ద యుద్ధభేరి ఉంది. ఆ చెట్టుకొమ్మ ఒకటి దానికి రాసుకొని గాలి వీచినపుడు అటు కదలి, "గుర్‌గర్!" అని ధ్వని వస్తున్నది.

నక్కకు అసలు రహస్యం తెలిసిపోయింది. పూర్తిగా భయంపోయింది ఇంతసేపూ అనవసరంగా భయపడిన తన అజ్ఞానాన్ని నిందించుకొన్నది. ఇక జాగు చేయక మాంసం సేవించాలని దూకబోయి ఆగింది. తోలును తిని ఆపై అక్కడి

మాంసం తినవలెనని అనుకొంది. ఆ ప్రకారమే ఆ నక్క ముందుగా ఆ భేరికి అతికిన చర్మంనంతను ఆరగించి ఆపై అచటి మాంసంని నెత్తుటి గడ్డలను చాలా రోజులపాటు తింటూవుంది.

ఈ కథ చెప్పి కరటక, దమనకులు తమరాజైన పింగళకునకు ధైర్యం ఉపదేశించాయి. "ఎవరైనప్పటికీ భయంవల్ల నష్టపోతారు. ధైర్యంవల్ల లాభంపొందుతారు!" ఇది ఈ కథ నీతి.

## డిండిమము

**లోకంలో ఎవరికైనా సరే యుపకారం చేయడం ఉత్తమముల లక్షణం. అటువంటివారు తమకు అపకారం చేసిన వారికి కూడా ఉపకారం చేస్తారు. కాని** పాత్రత ఎరిగి దానము చేయాలి. అలాగే బుద్ధి తెలుసుకొని ఉపకారం చేయాలి. అల్పబుద్ధివానికి ఆకతాయికి ఉపకారం చేయడం మంచిదికాదు. అలా చేసినట్లయితే ప్రాణాంతకమే అవుతుంది. మనవల్ల ఉపకారం పొందినవారు మనకే కీడు చేస్తారు. ఈ నీతిని బోధించే కథ ఇది.

మందవిసర్పిణి అనే పేరుగల పేను ఒకటి ఉండేది. అది ఒక రాజుగారి పాన్పును ఆశ్రయించి పగటిపూట పరుపుక్రిందనో, తలగడక్రిందనో దాగి వుండి రాత్రి కాగానే బయటికి వచ్చేది. రాజుగారు గాఢంగా నిద్రపోయారని గ్రహించిన తర్వాత నెమ్మదిగా ఆయన గెడ్డంలో మూరి నొప్పి తెలియకుండా రక్తం త్రాగి కడుపు నింపుకొని వెళ్ళిపోయేది.

ఏ ఆటంకమూ, ప్రాణభయమూ లేకుండా ఆ పేను కాలం గడుపుతోంది. ఒకసారి ఆ మంచంపైకి నల్లి ఒకటి వచ్చింది దానిపేరు డిండిమము. అది బాగా బలిసి, పొతకవలె వున్నది. దానిని చూసి మందవిస్సరిణి ఇలా అడిగినది.

"నీ పేరేమిటి? ఎచట నుండి ఇచటకు వచ్చితివి?"

అప్పుడు ఆ నల్లి "నా పేరు డిండిమము. ఇంతకాలము నేను పేదల గుడిసెలలో వున్నాను. రాజుగారి రక్తం రుచిగా వుంటుందని విన్నాను. రుచి చూడాలని యిలా వచ్చాను. రాజనాల వరిబియ్యం, సుగంధ ద్రవ్యములు వేసిన పంటకాలు మధుర ఫలములు భుజించే రాజావారి రక్తం చాలా బాగుంటుందికదా! నన్ను నీ స్నేహితురాలిగా భావించి ఆశ్రయం యియ్యి" అని కోరింది.

అమాయకురాలైన పేను "సరే! ఉండు నా సొమ్మేమిపోయింది. నేను గద్దంలో దూరి రక్తపానం చేస్తా. నీవు మరోచోట రక్తాన్ని త్రాగు, నేటి నుంచి మనం మిత్రులం" అన్నది.

అప్పటినుండి మందవిస్పరిణి, డిండిమము స్నేహంగా వుండి రాజావారి ఒంటి రక్తమును విందారగించసాగాయి.



ఒకనాడు రాజావారు ఇంకా నిద్రపోలేదు. ఊరకనే పండుకొనినారు. ఆ సంగతిని గుర్తించక ఆయన నిద్రపోయారనుకొని డిండిమము మంచం క్రిందనుంచి పరుపుపైకి ప్రాకి రాజావారి నడ్డిక్రిందజేరి పుటుక్కున ఆయనను కుట్టి నెత్తురు త్రాగసాగింది మెలకువగావున్న రాజుగారు తటాలునలేచి భటులను పిలచి ప్రక్క దులిపివేయుడని తటాలున ఆజ్ఞాపించాడు.

భటులు లాంతరు తెచ్చేలోపల నల్లి చకచక సాగి మంచంక్రింద దాక్కున్నది. సంగతి తెలియక పేను మాత్రము తలగడ క్రింద వుండిపోయింది.

భటులు దీపం తెచ్చి ప్రక్క దులిపారు. తలగడ క్రిందగల పేనును చూశారు. అదే రాజావారిని కుట్టి ఆయన నిద్రకు భంగం కలుగజేసిందని భావించి వారా పేనును చంపేశారు.

అల్పబుద్ధివాడైన డిండిమమునకు ఉపకారముచేసి మంచి విసర్పిణి ప్రాణాలు పోగొట్టుకొన్నది.

## పెద్దవారితో స్నేహం

స్నేహం అనేక రకాలు. తాత్కాలిక స్నేహం, శాశ్వత స్నేహం, దొడ్డ వారితో స్నేహం, మంచివారితో స్నేహం! అల్పులతో స్నేహం, విజ్ఞులతో స్నేహం ఇలా మిత్రత్వం అనేక విధాలుగా వుంటుంది. ఒక అవసరం తీర్చుకొనడానికి అప్పటికప్పుడు చేసే స్నేహ్నం తాత్కాలిక స్నేహం. యుద్ధ సమయాలలో రాజులు ఇలాంటి స్నేహాలు చేస్తుంటారు. ఆపద వచ్చినపుడు కూడా ఆ మనిషి ఆ గండాన్ని గట్టెక్కడానికై కొందరితో తాత్కాలిక మైత్రి నెరపుతుంటాడు.

అలాకాక కష్ట సుఖాలలో ఆపద ఆనంద సమయాలలో కలసి వుండే స్నేహం శాశ్వత స్నేహం. కృష్ణ కుచేలుర స్నేహం అటువంటిదే. ఈ స్నేహానికి సంపదతో అధికారంతో పనిలేదు.

ఐతే ఒక్కొక్కసారి దొడ్డవారితో స్నేహం అవసరమవుతుంది. వారు సంపదలు గలవారు కావచ్చు! అధికారం గలవారు కావచ్చు! బలవంతులుకావచ్చు! సుగ్రీవుడు వాలిని చంపించడానికై దొడ్డవాడైన రాముని స్నేహాన్ని సమయాన్ని పొందాడు. అలాగే చెడ్డవారితో స్నేహం. రావణాసురుడు దుర్బుద్ధితో సీతను అపహరించాలని మారీచుని సహాయం కోరెను. ఐతే చెడ్డవారితో చెలిమి ఉభయులకు కష్టకారకమే అవుతుంది. అలాగే అల్పులతో చెలిమి కూడా ఎన్నో కష్టాలను తెచ్చి పెడుతుంది.

దొడ్డవారితో, విజ్ఞులతో చెలిమిచేయడం అన్ని విధాల మంచిది. శ్రీరామునితో చెలిమిచేసిన సుగ్రీవుడు, శ్రీకృష్ణునితో చెలిమి చేసిన పాండవులు ఎంతో లాభం పొందారు. చాలా సుఖం పొందారు. గనుక దొడ్డవారితో చెలిమి చేయాలి. ఇందుకు చక్కటి ఉదాహరణ ఈ కథ.

ఒక పెద్ద సముద్రం వుంది. ఆ సముద్ర వొడ్డున ఒక చెట్టు వున్నది. ఆ చెట్టుపై తీతువుల జంట గూడుగట్టుకొని కాపురం వుంటున్నాయి. కొన్ని రోజులకు ఆడతీతువు గర్భము ధరించింది. గ్రుడ్లు పెట్టింది. అవి పిల్లలై తమ సంతతి వృద్ధి చెందుతుందని అవి ఆనందించాయి.

ఐతే యీలోగా సముద్రములో కెరటాలు తాటి చెట్టంత యెత్తు లేచాయి. తీతువు పిట్టలు గాలిలోకి ఎగిరి ప్రాణాలు కాపాడుకొన్నాయి. కాని ముచ్చటగా కట్టుకొన్న గూడు ప్రాణప్రదంగా చూసుకొంటున్న గూటిలోని గ్రుడ్లు సముద్ర కెరటాలలా కొట్టుకొనిపోయాయి. తీతువు దంపతులు యెంతో బాధపడ్డాయి.

కొన్నాళ్ళకు వాటి దుఃఖం క్రమంగా తగ్గింది. మరల కొత్త గూడు కట్టాయి, ఆడతీతువు మరల గర్భవతయింది. గ్రుడ్లను పెట్టింది. మరల సముద్రుడు చెట్టంత యెత్తున పొంగాడు గూడు, గ్రుడ్లు కొట్టుకొనిపోయాయి.

తీతువు దంపతులు యెంతో విలపించాయి. మరల గూడుకట్టాయి. ఆడ తీతువు మరల గ్రుడ్లుపెట్టింది. సముద్రుడు పొంగాడు. ఆ గూడు వాటి గ్రుడ్లు కొట్టుకుపోయాయి. ఆడతీతువు దుఃఖానికి అంతులేదు.

అప్పుడు మగతీతువు కోపగించి సముద్రుడితో ఇలా అన్నాడు.

"ఓ సముద్రుడా! మేము చిన్న పక్షులమని నువ్వు మాపై విరుచుకు పడుతున్నావు. ఇది నీకు ధర్మంకాదు. ఈసారి నా భార్య గ్రుడ్లను పెట్టినప్పుడు నీవు పొంగవలదు జాగ్రత్త! పిల్లలపై సమస్త జీవులకు ప్రేమ ఉంతుంది. ఈ సంగతి నీకు తెలియనిది కాదు."

మగతీతువు మాటలు విని సముద్రుడు పకపక నవ్వాడు. ఆ పక్షి మాటలను అతడు లక్ష్యపెట్టలేదు.

ఆడతీతువు మరల గర్భం ధరించింది. గ్రుడ్లు పెట్టింది. సముద్రుడు ఇదివర కటివలెనే పైకి ఎగసి కెరటాల చేతులతో ఆ గూటిని గ్రుడ్లను తనలోకి లాగు కొన్నాడు.

దీనితో మగతీతువు కోపం పెరిగినది. కాని బలవంతుడైన సముద్రుని తానేమి చేయగలడు? ఏమి చేయలేడు మరి కర్తవ్యము?

మగ తీతువుకు యేమీ చేయడానికి ఉపాయం తోచలేదు. అప్పుడు ఆడ తీతువు మగనితో ఇలా అన్నది.

"మనం చిన్న పక్షులం. సముద్రుడు మన మాట వినడు. మనపై కనికరించడు అని ఊరుకున్నచో జీవితాంతము ఈ గర్భశోకం నాకు తప్పదు. నా శోకం మీకును వేదనయే కద! గనుక మన జాతివాడైన గరుత్మంతుని ప్రార్థిద్దాం ఆయన సహాయాన్ని కోరుదాం. పెద్దవాడు, బలవంతుడు అయిన గరుత్మంతుడు వచ్చి మందలించిన కాని సముద్రుడు శాంతించడు."



భార్య మాటలకు మగటీటువు సంతోషించినాడు. విష్ణుమూర్తి వాహనమై ముల్లోకాలను నిముషాలలో ఎగిరివచ్చే మహాపరాక్రమవంతుడైన గరుత్మంతుని వారిద్దరూ ప్రార్థించారు.

దయామూర్తి అయిన గరుత్మంతుడు ప్రత్యక్షమయ్యాడు. ఏమి సహాయం కావలెనో అడగమన్నాడు. అప్పుడు టీటువులు ఇలా కోరాయి.

"దేవలోకమునుండి అమృతమును తెచ్చి తల్లి చెర విడిపించిన ఓ గరుత్మంతా! నీకు నమస్కారము. పక్షి కులమునకే పేరు ప్రతిష్ఠలు తెచ్చిన మహా పరాక్రమవంతుడా! చిన్న పక్షులమయిన మాకు నీ సహాయం కావలెను. సముద్రుడు

గర్వంతో పొంగి నా గ్రుడ్లను తీసుకుపోతున్నాడు. నీ పరాక్రమం ప్రదర్శించి మా సంతానమును మాకిచ్చేటట్లు సముద్రునికి చెప్పు. ఇక ఎప్పుడునూ సముద్రుడు మా గూటిపై విరుచుకొని పడకుండా ఆజ్ఞాపించుము. నా గర్భశోకము చల్లార్చుము."

ఆ తీతువు ప్రార్థనను, వేడుకోలును మన్నించి గరుత్మంతుడు సముద్రునిపై కోపగించాడు. "సముద్రా!" అని కేకవేశాడు.

విష్ణుమూర్తి వాహనమయిన గరుత్మంతుడే తనపై ఆగ్రహించిన ప్రమాదకరమని తలచి సముద్రుడు ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు గరుత్మంతుడు సముద్రునితో యిలా అన్నాడు-

"సముద్రా! ఈ తీతువుల గ్రుడ్లను తెచ్చి యిమ్ము, ఇక ఎన్నడూ వాటి బ్రతుకులలో చిచ్చు రగల్చకు. ఇది నా ఆజ్ఞ!"

గరుత్మంతుని ఆజ్ఞ ప్రకారం సముద్రుడు తీతువు గ్రుడ్లు తెచ్చి ఇచ్చాడు ఇక ఎన్నడూ వాటి గూటిని తాకనని, వాటి గ్రుడ్లను అపహరించబోనని ప్రతిజ్ఞ చేసి సముద్రుడు మాయమయ్యెను. తీతువు దంపతులు సంతోషంతో గరుత్మంతునికి కృతజ్ఞతలు తెలిపాయి. వాటిని ఆశీర్వదించి గరుత్మంతుడు మాయమయ్యాడు. నాటి నుంచి ఆ తీతువు దంపతులు హాయిగా జీవించాయి.

పెద్దవారితో చెలిమి కష్టాన్ని తొలగిస్తుంది. దుష్టులవలన కలిగే బాధల్ని నివారిస్తుంది.

## వజ్రదంగి - సింహం

పెద్దవారితో చెలిమి అనేక విధాల ఉపయోగకరమయినట్లయితే చెడ్డవారితో చెలిమి ఎన్నో రకాలుగా హాని చేకూరుస్తుంది. ఒక్కొక్కసారి మంచి మిత్రుల్ని కూడా దూరం చేస్తుంది. హితైషుల్ని దూరం చేస్తుంది. ఆత్మీయుల్ని దూరం చేస్తుంది చివరకు చేటు తెస్తుంది. అందువలన సర్వవేళలయందు మంచి వారితోనే చెలిమి చేయాలని పెద్దలు పదే పదే గుర్తు చేస్తుంటారు.

అగ్నిదేవుడు ఎంతో శక్తిగలవాడు. ఆయన వాయుదేవునితో చెలిమి చేసినట్లయితే ఇంకా శక్తి పెరిగి ఎంతగానో పెరిగిపోతాడు. ఉజ్వలంగా ప్రకాశిస్తాడు.

వేయి నాల్కలతో జ్వాలల్ని రేపగలుగుతాడు. నిమిషాల మీద ఈ ప్రపంచాన్ని భస్మీపటలం చేయగలుగుతాడు.

అలాకాక "నేను అగ్నిని నాకేమిటని" విర్రవీగి నీచుడయిన ఇనుముతో స్నేహంచేస్తే ఏమవుతుంది? కొలిమిలో యినుముతో చేరిన అగ్నిదేవునకు కూడా

సమ్మెట దెబ్బలు తప్పవు. చివరకు నీటిలో మునిగిన ఇనుప ముక్కవలె పరాక్రమం చల్లారిపోక తప్పదు.



గనుక ఎంతటి గొప్పవారయినా అల్పులతో నీచులతో చెలిమి చేయరాదు. సమ ఉజ్జీలతో లేదా అంతకంటే గొప్పవారితో చెలిమి చేయాలి. చెలిమిని పెంచుకోవాలి. లేకుంటే ప్రమాదం. ఇనుము సహవాసము చేసిన అగ్ని చెలిమిని వాయువు కూడా విడిచిపెట్టినట్లే నీచులతో కలిసిన వారిని మంచి మిత్రులు కూడా విడచి పెడతారు. ఈ నీతిని వివరించే చిన్న కథ ఇది.

ఒక వడ్రంగి వుండేవాడు. అతడు కొయ్యసామానును చేయడంలో నేర్పరి. మంచివాడు. రోజూ తన గ్రామంలో కొయ్యసామానులు చేసి అడవి మార్గం గుండా దగ్గరలోని పట్టణానికివెళ్ళి వాటిని అమ్ముకొనేవాడు. ఆ డబ్బుతో కావలసిన పప్పు, ఉప్పు, బియ్యం, తినుబండారాలు కొనుక్కొని వచ్చేవాడు.

రోజూ అడవిమార్గంలో వెళ్ళే అతనికి ఒక సింహంతో చెలిమి అయింది.

ఇద్దరి స్నేహం బాగా పెరిగింది. వడ్రంగి రోజూ పట్టణం నుంచి వచ్చేటప్పుడు సింహానికి తినుబండారాలు తెచ్చిపెట్టేవాడు. పండుగలకు పబ్బాలకు ఇంటి దగ్గర నుండి పిండివంటలు తెచ్చి తినిపించేవాడు.

ఇలా కాలం గడిచిపోతుంది. వారి చెలిమి బాగా వృద్ధి చెందుతోంది. ఐతే ఈ మధ్యకాలంలో సింహానికి మరి ఇద్దరు స్నేహితులయ్యారు. వారు కాకి, నక్క. అవి కూడా నీచజాతికి చెందినవే. ఐనా సింహం తాను మృగరాజుననీ తనకు ఉత్తమ జాతికి చెందిన మంచి మనిషి నేస్తంగా వున్నాడని గర్వం వుంది. అందుకే వాటితో చెలిమి చేసినా తప్పులేదని భావించి సింహం వాటితో చెలిమి నెరపుతున్నది. తన వడ్రంగి స్నేహితుని గురించి వాటికి వివరించి చెప్పింది.

అవి అతణ్ని తమకు చూపించమని కోరాయి. ఒకనాడు స్నేహితులు ఇద్దర్నీ తీసుకొని సింహం వడ్రంగి వచ్చువేళకు అక్కడ చేరింది. సమయం ప్రకారం వడ్రంగి నెత్తిన తినుబండారాల బుట్టతో వచ్చాడు.

సింహం వెంట నక్క, కాకి వుండడం చూచి వెంటనే చెట్టుపైకి ఎక్కి కూర్చున్నాడు. సింహం ఆశ్చర్యపోయింది. నక్క, కాకి కూడా ఆశ్చర్యపడ్డాయి. రోజూ పిండివంటలతో సింహానికి విందుచేసే వడ్రంగి ఇవాళ తమను చూసి తినుబండారాలతో సహా చెట్టుయెక్కి కూర్చోవడం వింతగా వుంది. అదే మాటను సింహం అడిగింది.

"మిత్రమా! వీరు నా కొత్త స్నేహితులు. నీకూ మిత్రులే! వీరిని చూచి భయపడనక్కరలేదు. చెట్టుదిగిరా. రోజూ నాకు విందుచేసేవాడివి కదా! నేడు వీరందరికీ పసందైన ఫలహారాలు పెట్టు భయమేల రా"

సింహం మాటవిని వడ్రంగి ఇలా అన్నాడు:

"మిత్రమా! నువ్వు సింహానివనీ, మృగాలకు రాజువనీ ఇన్నాళ్ళు నీతో స్నేహం చేశాను. చెలిమి ఉత్తములు ఉన్నతులూ అయినవారితోనే చేయాలి. ఇది పెద్దలమాట. అందుకే జంతువులలో ఉత్తమజాతివాడవనీ అడవికి రాజై ఉన్నత పదవి నధిష్టించావనీ నీతో చెలిమితో గడిపాను. కాని నువ్వు నీకన్నా తక్కువ జాతివారైన నక్కతో కాకితో స్నేహం చేశావు. దీనితో ఔన్నత్యం పోయింది. పైగా నక్క జిత్తులమారి లక్షణములు గలది. ఈ కాకి వాడియైన ముక్కుకలది. ఈ నక్క కుటిలోపాయాలతో యేమయినా చేస్తుంది. ఈ కాకి పదునైన తన ముక్కుతో పొడిచి హింసించగలదు. ఇటువంటి దుష్టులతో నువ్వు స్నేహం చేశావు. గనుక యిక నేను నీతో చెలిమిని కొనసాగించను."




వడ్రంగి మాటలకు సిగ్గుపడి సింహం తలవంచుకొని వెళ్ళిపోయింది. ఆ తరువాత నక్క, కాకి వెళ్ళిపోయాయి.

అప్పుడు వడ్రంగి తన బుట్టతో సహా చెట్టుదిగి ఇంటికి వెళ్ళిపోయాడు. సింహం మంచి మానవ మిత్రుని కోల్పోయింది.

ఎంత గొప్పవారైనా సరే నీచులతో స్నేహం చేయరాదని ఈ కథ చెప్పే నీతి.

## తాను తీసిన గోతిలో

ఇతరులను మోసగించరాదు. మిత్రుల్ని అసలే వంచించరాదు. నమ్మినవారిని మోసగించటం మహాపాపం. మహాపరాధం. ఎవరిని మోసగించాలని గోయి తవ్వితే ఆ గోతిలో మనమే పడతాం. ద్రోహచింతనవల్ల సొంత ప్రయోజనాలకే భంగం కలుగుతుంది. చివరకు పరువుపోతుంది. విలువ అంతరించిపోతుంది. సంపద సన్నగిల్లిపోతుంది'' అని హెచ్చరించే కథ ఇది.

అది ఒక మహానగరం. ఆ నగరంలో అక్షీణవిభుడనే వ్యాపారి ఉన్నాడు. ఎప్పుడూ వైభవం క్షీణించనివాడని యీ పేరుకు అర్థం. అతని స్నేహితుడొక డున్నాడు. అతని పేరు అయోగ్యమిత్రుడు. అంటే యోగ్యుడైన మిత్రుడుకాడని అర్థం. వారి పేర్లవలెనే వారి స్వభావాలుండేవి. అందుకని వారిని "అన్వర్థ నామ ధేయులు" అనే వారందరూ.



అక్షీణవిభుడు పట్టిందల్లా బంగారమయ్యేది. అతని వైభవం ఎన్నడూ పెరుగుతుండేది. సంపద ఎల్లవేళలా వృద్ధి అవుతుండేది. అయోగ్య మిత్రునికి అంతా వ్యతిరేకంగా వుంది. అతనిని ఎవ్వరూ నమ్మేవారు కారు. వ్యాపారరీత్యా అన్నీ లావాదేవీలు పెట్టేవాడు. అన్నీ ముడులు వేసేవాడు. వాడికి వీడికి కజ్జాలు కలిగించి సంతోషించేవాడు.

ఇద్దరు దెబ్బలాడుకోవడం అతనికి సరదా. ఇద్దరు నష్టపోవడం అతని

పద్ధతి. తానుమాత్రం లబ్ధిని పొందడమాతని యుక్తి ఇలా రోజులు గడుస్తున్నాయి.

అక్షీణవిభునికి తన వ్యాపారమును విస్తరింపజేయాలనే బుద్ధి కలిగింది. విదేశాలకు వెళ్ళాలనే ఆలోచన వచ్చింది. దానికి తగిన పథకాన్ని తయారుచేసుకొన్నాడు. ప్రయాణానికి ముందురోజున అతను తన దగ్గరవున్న యాభై బారువుల బంగారాన్ని తీసుకొని అయోగ్యమిత్రుని ఇంటికి వచ్చాడు.

మిత్రునికి సకలవిధి ఉపచారములు చేయించి అయోగ్యమిత్రుడు సంగతి అడిగాడు. అప్పుడు అక్షీణవిభుడు ఇలా అన్నాడు.

"మిత్రమా! విదేశాలకుపోయి వర్తకం చేయదలచాను. నా దగ్గర యాభై బారువుల బంగారం వుంది. నేను విదేశాలనుండి తిరిగివచ్చేవరకూ ఆ బంగారాన్ని నీ దగ్గర దాచు తరువాత తీసుకొంటాను."

మిత్రుని మాటలువిని అయోగ్యమిత్రుడు సంతోషించాడు. చక్కగా వ్యాపారంచేసి లక్షలు ఆర్జించి క్షేమంగా తిరిగిరమ్మని బంగారాన్ని తన దగ్గర జాగ్రత్తగా దాస్తానని అభయం ఇచ్చాడు

అక్షీణవిభుడు మహానందంతో విదేశాలకు వెళ్ళిపోయాడు. ఇక్కడ అయోగ్యమిత్రునికి ఆశ పెరిగింది. బంగారంపై మోజుపడింది. మిత్రుడు తన దగ్గర దాచిన బంగారమును బెందెలనుండి తీసివేశాడు. వేరేచోట దాచుకున్నాడు. ఆ బిందెలకు అక్కడక్కడ చిల్లులు వేశాడు. ఏమీ యెరగనట్లు బెందెల్ని యథాస్థానములో భద్రపరిచినాడు.

కొన్ని సంవత్సరములు గడిచాయి. విదేశాలలో ఎంతో నైపుణ్యంతో వ్యాపారంచేసి లక్షలు సంపాదించి అక్షీణవిభుడు నగరమునకు తిరిగొచ్చాడు అందరితోపాటు అయోగ్యమిత్రుడు కూడా అక్షీణవిభునకు స్వాగత సత్కారములు చేశాడు. కొన్నిరోజులు గడిచాయి.

ఒకనాడు అక్షీణవిభుడు తన స్నేహితుని ఇంటికి వచ్చాడు. ఆ మాటా, ఈమాట అయిన తరువాత తన బంగారమును తెచ్చియిమ్మని అడిగాడు. అప్పుడతను ఇంటిలోకి వెళ్ళి చిల్లులుపడిన బిందెలను తెచ్చి విచారంగా ఇలా అన్నాడు.

"మిత్రమా! ఈ బిందెలకు చిల్లులువేసి ఎలుకలు బంగారం తినేసాయి. ఏమి చేయుదును?"

అక్షీణవిభుడు ఆశ్చర్యపడ్డాడు. "బంగారాన్ని ఎలుకలు తినివేయడమా ఇదెక్కడి వింత? అయోగ్యమిత్రుడే దాన్ని కాజేసి ఎలుకలు తిన్నాయని చెబు

తున్నాడు. సరే! ఈ మోసాన్ని మోసంతోనే తిప్పికొట్టాలి' అని ఆలోచించి మిత్రునితో ఇలా అన్నాడు.



"పోనీలే మిత్రమా! ఎలుకలు తినిన బంగారాన్ని నువ్వు మాత్రం ఎక్కడ నుంచి తెస్తావు! బాధపడకు."

ఈ విధంగా మిత్రుని ఊరడించి అక్షీణవిభుడు ఇంటికి వెళ్ళిపోయాడు. తన ఎత్తు ఫలించిన అయోగ్యమిత్రుడు నిర్భయంగా సంతోషంగా వున్నాడు. రోజులు గడుస్తున్నాయి.

ఒకనాడు అక్షీణవిభుడు స్నేహితుని ఇంటికి వచ్చాడు. అతని కుమారుని చూచి ముద్దాడాడు. బజారుకు తీసుకుపోయి మిఠాయిలు కొనిస్తానన్నాడు. అయోగ్యమిత్రుడు "అలాగే"నని కొడుకును మిత్రుని వెంట పంపాడు. అతను ఆ బాలకునితో బజారుకు వెళ్ళాడు.

కొంతసేపైనాక ఒక్కడే మిత్రుని ఇంటికి తిరిగొచ్చాడు. తన పిల్లవాడు యేడని అయోగ్యమిత్రుడు అడిగాడు.

"బజారులో నడుస్తుండగా పిల్లవాడ్ని రాకాసిగద్ద ఎత్తుకుపోయింది. ఏమి చేద్దాం?" అని అక్షీణవిభుడు విచారంగా చెప్పాడు. అప్పుడు అయోగ్యమిత్రుడు కోపగించెను. తన కుమారుని ఏదో చేసి అబద్ధమాడుతున్నాడని భావించి ఈ సంగతి రాజుగారికి ఫిర్యాదు చేశాడు.



రాజు సంగతి విని ఆశ్చర్యపడి అక్షీణవిభునకు కబురు పంపాడు. అతను వచ్చి రాజుకు నమస్కరించాడు.

అప్పుడు రాజు ఇలా అడిగాడు-

"నగరంలో పేరుమోసిన వ్యాపారివి నువ్వు. మిత్రుని కొడుకును అప

హరించి గ్రద్ద ఎత్తుకొనిపోయినదని చెప్పుట న్యాయమా? గ్రద్ద ఎంత? పిల్లవాడెంత? మానవ బాలకుణ్ని పక్షి ఎత్తుకుపోవునా?"

రాజుగారి మాటలు విని అక్షీణవిభుడు "ప్రభూ! బంగారమును ఎలుకలు తింటాయా? అదే నిజమైతే పిల్లవానిని గ్రద్ద ఎత్తుకుపోవడం ఎలా అబద్ధమౌతుంది?" అని ప్రశ్నించాడు.

అప్పుడు రాజు అక్షీణవిభుని ఆ సంగతి వివరించమని అడుగగా అతడు తన బంగారం గురించి అయోగ్యమిత్రుడు సమాధానం తెలియజేశాడు.

అందుకు రాజు ఆశ్చర్యపడి అయోగ్యమిత్రుని మందలించి యాభయ్ బారువల బంగారం తెప్పించి అక్షీణవిభునికి ఇప్పించాడు.

అక్షీణవిభుడు కూడా తాను అంతవరకు తన యింట దాచివుంచిన అతని కొడుకును అప్పగించాడు.

నాటినుంచి అయోగ్యమిత్రుడు ఎవరి ముఖం చూడలేక కృశించాడు. మిత్రుని మోసగించాలని తాను చేసిన గోతిలో తానేపడిన అయోగ్యమిత్రుని కథ వంచకులకు కనువిప్పు కావాలి.

ఈ విధంగా విష్ణుశర్మ మిత్రభేదాన్ని దానిలోని నీతికథలను సుందర్శన మహారాజుగారి కొడుకులకు చెప్పి వారికి కొంతవరకు విజ్ఞత వచ్చేటట్లు చేశాడు.

మిత్రలాభం, మిత్రభేదం ప్రకరణాలను ఆయన జంతువులు ప్రధాన పాత్రలుగా నడిపాడు. మిత్రలాభంలో హిరణ్యకుడు, చిత్రాంగుడు, మంథరుడు జంతువులు కాగా లఘుపతనకుడు, చిత్రగ్రీవుడు మాత్రము పక్షులు. పిట్ట కథలలో పక్షులు, జంతువులు కలగా పులగంగా వస్తాయి.

మిత్రభేదంలో కూడా పింగళకుడు, సంజీవకుడు, కరటక దమనకులు జంతువులు. దీనిలో ప్రధాన కథలో పక్షులు రావు. పిట్టకథలలో మాత్రం అవీ ఇవీ వస్తాయి.

ఇలా చెప్పడంలో, విష్ణుశర్మ ఒక చిత్రాన్ని పాటించాడనిపిస్తుంది. పెద్ద జంతువులు జిత్తులమారి పనులలో మంచివైన పక్షుల్ని యిరికించడం సబబు కాదను కొని ఉంటాడాయన. ఉపాయం కథలలో పక్షుల్నే ఎక్కువగా ఉపయోగించాడు.

ఇక "విగ్రహం సంధి" ప్రకరణాలలో ఆయన పక్షుల్నే ప్రధాన పాత్రల్ని చేశాడు. ఈ రకంగా జంతువుల పక్షుల సహజ స్వభావాల్ని తేటతెల్లం చేయడం విష్ణుశర్మ ఆంతర్యం అర్థం అయివుంటుంది.

# భలే జంతువులు

పంచతంత్ర కథలలో మనకు ఎన్నో జంతువులు, పక్షులు కనిపిస్తాయి. పలుకరిస్తాయి. ఆ కథలు తెలుసుకొన్నాం. ఇప్పుడు ఆ జంతువుల, పక్షుల గురించి తెలుసుకొందాం.

హిరణ్యకుడు : ఇది ఎలుక. హిరణ్యం అంటే బంగారం. బంగారంవంటి మంచి మనసు వున్నది గనుక దీనికి ఆ పేరు పెట్టాడు.

మంథరుడు : ఇది తాబేలు. మంథరం అంటే ఒక పర్వతం పేరు. కొండవలె గట్టి పెంకు వుంటుంది గనుక దీనికి ఆ పేరు వచ్చింది.

లఘుపతనకుడు : ఇది కాకి. లఘు అంటే చిన్నది అని అర్థం. ఇది చిన్న పక్షి కనుక ఈ పేరు వచ్చింది.

చిత్రగ్రీవుడు : ఇది పావురం. చిత్ర అంటే విచిత్రమైనవని, గ్రీవ అంటే మెడ గలది అని అర్థం. అందుకే దీనికా పేరు పెట్టాడు.

చిత్రాంగుడు : ఇది లేడి. చిత్ర విచిత్రమైన చుక్కలతో వుంటుంది గనుక దీనికా పేరు వచ్చింది.

జరద్గవము : ఇది గ్రద్ధ.

దీర్ఘ కర్ణుడు : ఇది పిల్లి. ఎంత దూరములో శబ్దాన్నైనా వినగలదు గనుక యీ పేరు వచ్చింది.

దుష్టబుద్ధి : ఇది కాకి. చెడు స్వభావం గలది.

ఇవి మిత్రలాభం కథలోవచ్చే జంతువులు, పక్షులు ఇక మిత్ర భేదం కథలోకనిపించే జంతువుల. పక్షులవివరం తెలుసుకొందాం.

సంజీవకుడు : ఇది ఎద్దు. చాలా బలం కలది. అందుకే ఈ పేరు.

పింగళకుడు : ఇది సింహం. అడవికి రాజు. మెరుగుపెట్టని బంగారు రంగులో వుంటుంది గనుక ఈ పేరు.

కటకుడు : ఇవి నక్కలు, పింగళకుని మంత్రి కొడుకులు.

దమనకుడు : వక్రబుద్ధి స్వభావంగలవి గనుక ఈ పేర్లు పెట్టాడు.

కాటకుడు, పాటకుడు : ఇవి కూడా నక్కలే. కాటకం అంటే కరవు. ఈ నక్కకు ఎప్పుడూ ఏడుపే. పాటకం అంటే అల్పాత్వం అని అర్థం. ఈ నక్కకు ఎప్పుడు నీచపు ఆలోచనలే. ఇవి పింగళకుని శత్రువులు.

నందకుడు : ఇది సంజీవకుని తోడు ఎద్దు. బలమైనది.

మందవిసర్పిణి : ఇది పేను. నెమ్మదిగా నడిచి రహస్యంగా వుంటుంది.

డిండిమము : ఇది నల్లి.

లొట్టిపిట్ట : ఒంటె

టిట్టువు : ఒక పక్షి. ఇది కూస్తే దుశ్శకునం అంటారు.

దూరదర్శి : ఒక చేప. తెలివైనది.

కుశాగ్రబుద్ధి : ఒక చేప. కొంచెం తెలివున్నది.

మందబుద్ధి : బుద్ధిలేనిది. ఇది ఒక చేప.

సూచీముఖం : ఇది ఒక పక్షి. సూదైన ముఖం కలది కనుక ఈ పేరు.

దుష్టబుద్ధి : ఒక వర్తకుడు. చెడ్డవాడు.

సుబుద్ధి : ఒక వర్తకుడు మంచివాడు.

అయోగ్యమిత్రుడు : యోగ్యుడైన మిత్రుడు కాడు.

అక్షీణవిభుడు : క్షీణించని సంపద కలవాడు.

పేరుపెట్టని కోతులు, పక్షులు ఎన్నో ఈ కథలో వచ్చాయి. వాటికిపేర్లు చెప్పవలసినంత ప్రాధాన్యంలేదు కనుక విష్ణుశర్మ వాటికి నామకరణాలు చేయలేదు.

ఇంతటితోనే ఈ కథలు అయిపోలేదు. "విగ్రహం-సంధి" ప్రకరణాలతో రెండవభాగం వుంది. అది కూడా చదివితేనే యీ కథల అంతరార్థం అంతుపడుతుంది. రెండవభాగం చదవడం మరచిపోకండి.

***

బాలానంద

# పంచతంత్రం

## (రెండవ భాగం)

పురాణపండ రంగనాథ్

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

తెలుగు అక్షరం అంతాలు చూపి,
శబ్దం లోతులు, ధ్వని లోకం ఆంతర్యాలు
అనుభూతికి తెచ్చి మాకు మాటలు
నేర్పిన మా అన్నయ్య
"ఉషశ్రీ"కి నమస్సులతో
ఇది అంకితం చేస్తున్నాను.

—రంగనాథ్

# లోపలి పేజీలలో....




# రెండవ భాగం
## పరిచయం

పంచతంత్రం కథలు అనగానే మనకు రకరకాల జంతువులు, పక్షులు, వాటి యెత్తులు, పై యెత్తులు, గెలుపు ఓటములు గుర్తుకు వస్తాయి. ప్రధాన కథతో బాటుగా ఎన్నో నీతుల్ని చెప్పే పిట్టకథలు కనిపిస్తాయి. గర్జించే సింహాలు మాట్లాడుతాయి. గాండ్రించే పులులు పలుకుతాయి. కువకువలాడే పావురాయిలు, కిచకిచలాడే కోతులు సంభాషిస్తాయి. ఎద్దులు, గ్రద్దలు, ఎలుకలు, జింకలు— ఒకటేమిటి మనకు పరిచయం ఉన్న అన్ని రకాల జంతువులు, పక్షులు పరస్పరం మాట్లాడుకొంటాయి. ఒక్కొక్కమాట ఒక్కొక్క నీతికి కోట. ఒక్కొక్క కథ ఒక్కొక్క జీవిత సత్యానికి సాక్ష్యం. పైగా జంతువులు, పక్షులు మాట్లాడటం అంటే సరదాగా ఉంటుంది. అందుకే పంచతంత్ర దేశ దేశాల పాఠకుల్ని ఆకర్షించింది. తరతరాల బాలబాలికల్ని ఆకట్టుకొంది. ఎన్నో భాషలలోనికి అనువదింపబడింది. ఎందరెందరో ఆ కథల్ని రాశారు రాస్తున్నారు, ఈ కథలు ఎవరికి యెప్పుడు యెందుకు చెప్పారు?

పాటలీపుత్రాన్ని సుదర్శనుడు అనే మహారాజు పరిపాలించేవాడు. ఆయనకు మగపిల్లలున్నారు. కాని వారికి లోకజ్ఞానం లేదు. సులభంగా వారికి విద్యాబుద్ధులు చెప్పి, ఇంగితజ్ఞానాన్ని ఇవ్వగల పండితునకై రాజుగారు అన్వేషించారు. తమ రాజ్యంలోనే విష్ణుశర్మ అనే పండితుడు ఉన్నాడని ఆయనకు తెలిసింది.

వెంటనే విష్ణుశర్మను పిలిపించి సంగతి చెప్పాడు. మందమతులయిన తన పిల్లలకు తక్కువ కాలంలో లోకజ్ఞానాన్ని చెప్పమని కోరాడు.

విష్ణుశర్మ "అలాగే" యని ఆ బాలకుల్ని తీసుకొని వెళ్ళాడు. వారికి చిన్న చిన్న కథల ద్వారా లోకజ్ఞానాన్ని, రాజనీతిని బోధించాలనుకొన్నాడు. వారు కూడా కథలపట్ల ఆసక్తి కనపరిచారు. విష్ణుశర్మ చెప్పిన నీతికథలు అన్నింటినీ కలిపి "పంచతంత్రం" అంటారు.



విష్ణుశర్మ రాకుమారులకు విగ్రహము చెప్పుట

"పంచ" అంటే "ఐదు" యని "తంత్రం" అంటే "ఉపాయం" యని అర్థం. మనిషి కాని, రాజు కాని తన జీవితంలో ఎటువంటి సమస్యలు యెదురైనప్పటికీ ఈ ఐదు రకాల ఉపాయాలతో గట్టెక్కవచ్చునని విష్ణుశర్మ వారికి ఉపదే

శించాడు. ఆ ఉపాయాలు 1. మిత్రలాభం, 2. మిత్రభేదం, 3. విగ్రహం, 4. సంధి, 5. లబ్ధనాశనం.

ఈ ఐదు ఉపాయాలకు సంబంధించిన మొదటి నాలుగు ప్రకరణాల కథలు బాగా ప్రచారం పొందాయి. మిత్రలాభం కథల్ని చిన్నయ సూరిగారు ఆనాటి తెలుగు వచనంలో అందంగా వ్రాశాడు. విగ్రహం, సంధి ప్రకరణాలను కందుకూరి వీరేశలింగం పంతులుగారు, విగ్రహం ప్రకరణం ఒక్క దానిని కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు లబ్ధనాశనం ప్రకరణాన్ని చెరకువాడ వేంకటరత్నం పంతులుగారు వ్రాశారు. ఇవన్నీ భాషాపరంగా ఈనాటి బాలబాలికలకు అందుబాటులో లేనివి. పైగా ప్రధాన కథలోంచి ఎన్నో పిట్ట కథలు బీరపాదుల్లా అల్లుకుపోయి ఉంటాయి. కనుక అసలు కథను గుర్తుంచుకోటం కష్టం.

అందుకే నేటి బాలబాలికలకు సులభంగా ఈ కథల్ని చెప్పాలని మా ప్రయత్నం. మూలపంచతంత్రలోవలె కాక, ఇందులో యే కథకా కథ విడివిడిగా చదువుకొందాం.

మొదటిభాగంలో మిత్రలాభం, మిత్రభేదం ప్రకరణాలలోని కథలు ఇచ్చాను. ఇప్పుడు ఈ రెండవ భాగంలో "విగ్రహం, సంధి" ప్రకరణాల కథలు తెలుసుకొందాం. మొదటి సంపుటిలోవలెనే ప్రధాన కథ ముందు చెప్పుకొని, విడి విడిగా కథల్ని వేరుగా చెప్పుకొందాం.

— * —




"విగ్రహం" అంటే మనకు యేదో దేవుడి బొమ్మనిపిస్తుంది. కాని "విగ్రహం" అనే పదానికి "విరోధం" యనే అర్థం కూడా ఉంది. ఇద్దరు మనుష్యుల మధ్య, లేదా రాజుల మధ్య యేర్పడే విరోధాన్ని లేదా శత్రుత్వాన్ని "విగ్రహం" అంటారు. తెలిసిన వారిమధ్య విరోధం కల్పింపడం "మిత్రభేదం" అవుతుంది. ఒకరి కొకరు తెలియకుండానే ఎవరో చెప్పిన దానిని బట్టి పరస్పరం శత్రుత్వము వహించడాన్ని "విగ్రహం" అంటారు. ఈ కథలో అదే జరిగింది. ఇద్దరు పక్షి రాజులమధ్య శత్రుత్వం పెరిగి, పరస్పరం యుద్ధం చేయడం దీంట్లోని ప్రధాన కథ. ప్రధాన కథతోబాటు సమయాన్ని, సందర్భాన్నిబట్టి చిన్నచిన్న నీతి కథలు వస్తాయి..ఇది పరిచయం. ఇక ప్రధాన కథ :

నీటి పక్షుల రాజయిన హిరణ్యగర్భునకు, భూపక్షుల రాజయిన చిత్రవర్ణునకు జరిగిన యుద్ధం "విద్రహం" అనే ఈ కథాభాగంలో వివరించబడింది. ఈ కథలోవన్నీ పక్షులే. హంసలు, చిలుకలు, కోడిపుంజులు, బాతులు, కాకులు,నెమళ్ళు ఒక్కటేమిటి రకరకాల పక్షులు దీనిలో మనకు కనిపిస్తాయి. యెత్తులకు పైయెత్తులు వేస్తాయి. జిత్తులమారి పనులు నిర్మిస్తాయి.

హిరణ్యగర్భుడు హంస. నీటి పక్షులకు రాజు. అతని మంత్రి పేరు సర్వజ్ఞుడు. అది సారసపక్షి. అతని కొలువులో పేరెన్నికగన్నది దీర్ఘముఖుడు. అంటే పొడవయిన ముక్కు కలదని అర్థం. వీరిది కర్పూరదేశం. దానినే కర్పూర ద్వీపం అని కూడా అంటారు. అక్కడ "పద్మకేళి" అనే పెద్ద సరస్సు వుంది. అదే హిరణ్యగర్భుని నివాసస్థానం.

ఆ సరస్సులోని యెన్నో రకాల నీటి పక్షులకు హిరణ్యగర్భుడు రాజు. అతడు బలవంతుడు, ధైర్యవంతుడు, బుద్ధిమంతుడు. అందుకే ఆ జల పక్షులన్నీ ఆ హంసను రాజుగా పెట్టుకొన్నాయి. హంసరాజు తనను నమ్ముకొన్న పక్షులను యెంతో జాగ్రత్తగా కాపాడుతూ, వారి యోగక్షేమాలు చూస్తుండేది. వారు కూడా తమ రాజు చెప్పిన మాట జవదాటక అవాకువతో, మంచితనంతో కాలక్షేపం చేస్తున్నాయి.

హంసకు వొక విలక్షణాశక్తి వుంది. పాలను, నీటిని కలిపి హంసకు ఇస్తే అది పాలను మాత్రమే త్రాగి నీటిని వదలివేస్తుందట! దీనినే "క్షీరనీర న్యాయ"మంటారు. అటువంటి శక్తి మరి యే యితరమైన పక్షికి లేదు. అటువంటి హంసజాతికి చెందిన ఉత్తముడు హిరణ్యగర్భుడు దాని సింహాసనం తామర పువ్వు.

## హిరణ్యగర్భుని కొలువు

ఒకనాడు హిరణ్యగర్భుని కొలువులో తామరపువ్వుపై కూర్చుని ఉన్నాడు. రకరకాల కొంగలు, సారసపక్షులు, బాతులు, హంసలు రాజుగారి చుట్టూ కూర్చుని ఉన్నాయి. ఆ ఏడాది వర్షాల గురించి, చేపల పంటల గురించి చెబుతూంటే అందరూ వింటున్నారు. ఇంతలో ఒక బాతు దూత వచ్చి రాజా వారికి నమస్కరించి, "హిరణ్యగర్భ మహారాజా! విదేశాలకు యాత్రలు చేయడానికి వెళ్ళిన దీర్ఘముఖుడుగారు తిరిగి వచ్చినారు. మీ దర్బారునకు పంపమంటారా?" అని మనవి చేశాడు.

దీర్ఘముఖుని వెంటనే ప్రవేశ పెట్టమని హంసరాజు అనుమతి నివ్వగా బాతు దూత వెళ్ళింది.

దీర్ఘముఖుడు ఒక కొంగ. అది కర్పూర ద్వీపంలోని సింహ రాజ్యంలో ప్రముఖమయింది. హంసరాజుగారికి ఇష్టమయింది కూడా. దేశ దేశాలలో వింతలూ, విశేషాలూ చూచి రమ్మని అచట విజ్ఞానాన్ని గ్రహించమని హిరణ్యగర్భుడు దీర్ఘ ముఖుని చాలా నెలల క్రితమే పంపించాడు. ఆ దీర్ఘముఖుడు దేశాటనం పూర్తి చేసుకొని తిరిగి వచ్చాడు! అతడ్ని చూడాలని రాజుగారు కూడా ఆత్రుతతో

వున్నారు. సభలోనివారు కూడా దీర్ఘముఖుని ముఖత దేశదేశాల వింతలు విని ఎంతో ఉత్సాహపడుతున్నారు.

ఇంతలో దీర్ఘముఖుడు రానేవచ్చాడు. అతను వినయంగా హంసరాజు గారికి నమస్కరించాడు. కాశ్మీరంలో సేకరించిన కర్పూరాన్ని, జవ్వాజిని ఆయనకు కానుకగా ఇచ్చాడు. కేరళదేశం నుండి తెచ్చిన చక్కటి కొబ్బరి బొండాన్ని బహూకరించి ఇచ్చాడు. ఆంధ్రదేశం నుంచి తెచ్చిన చీనాంబరాన్ని రాజుగారికి కప్పి సత్కరించాడు. సభలోని వారందరూ హర్షధ్వానాలు చేశారు.



హిరణ్యగర్భుని కొలువు (దర్బారు)

అప్పుడు దీర్ఘముఖుడు రాజుగారికి కాశీవిశ్వేశ్వరుని ప్రసాదం ఇచ్చాడు. సభలోని వారందరికీ విభూతి ఇచ్చాడు! అందరూ ఎంతో సంతోషించారు. ఆపై

వింధ్యపర్వతం, హిమవత్పర్వతం చూశాను! మానస సరోవరం, నాసికాత్రయంబక చూశాను. గంగాసాగరం చూశాను. దానినే బంగాళాఖాతం అంటారు. సింధు సాగరం చూశాను. దానినే అరేబియా సముద్రం అంటారు. మూడు సముద్రాలు కలిసే కన్యాకుమారి ప్రాంతం చూశాను! కాశీ, గయ, ప్రయాగ, కురుక్షేత్రం, మధుర, ద్వారక, ప్రఖ్యాత క్షేత్రాలు తిరిగి వచ్చాను.

ఒకటేమిటి? యెన్నో ప్రదేశాలు తిరిగాను. ఎంతో విజ్ఞానాన్ని సముపార్జించాను. మన రాజ్యాన్ని గురించి, మన ప్రభువుల గొప్పతనము గురించి



దీర్ఘముఖుని పిలుచుచున్న చిత్రవర్ణుని సేవకులు

వారందరికీ వివరించి చెప్పాను. వారంతా సంతోషించారు. మన పరిపాలనను ఎంతో మెచ్చుకున్నారు."

ఈ మాటలు చెప్పి దీర్ఘముఖుడు ఆగిపోయాడు. విచారంగా నలువైపులా చూశాడు. హిరణ్యగర్భుడు, సభలోనివారు ఆశ్చర్యంగా దీర్ఘముఖుని చూశారు.

"దీర్ఘముఖా! హఠాత్తుగా అటులయ్యావేమి? నీకేమైంది? అనుమానించక సంగతి చెప్పు" మని హిరణ్యగర్భుడనగా విని, దీర్ఘముఖుడు దుఃఖము నాపుకొని కన్నీరు తుడుచుకొని ఇట్లు చెప్పాడు.

"మహాప్రభూ! అన్ని దేశాలవారు మిమ్ము మెచ్చుకొన్నారు. కాని చిత్రవర్ణుని దేశంలో మాత్రం దేవరవారిని అవమానపరిచారు. అందుకే నాకి విచారం."

"ఎవరా చిత్రవర్ణుడు? ఏమా కథ? వారు మమ్ములను అవమాన పరచ డమా? వివరంగా చెప్పు" మని హిరణ్యగర్భుడు తొందర చేయగా దీర్ఘముఖుడు వివరంగా ఇట్లు చెప్పాడు.

## చిత్రవర్ణుని రాజ్యం

అది జంబూద్వీపం. అచట వింధ్యపర్వతం వుంది. ఆ పర్వత శిఖరం పై ఆకాశ పక్షులెన్నో నివసిస్తున్నాయి. వాటిలో గ్రద్దలున్నాయి, చిలుకలున్నాయి, పావురాలున్నాయి, కోయిలలున్నాయి, నెమళ్ళున్నాయి, కాకులు, కోడిపుంజులు న్నాయి, పిచ్చుకలున్నాయి, గోరువంకలున్నాయి, రాజహంసలున్నాయి ఒక టేమిటి, యెన్నో రకల పక్షులక్కడ యెంతో స్నేహంగా వుంటున్నాయి.

ఆ పక్షులన్నింటికి రాజు చిత్రవర్ణుడు. అది నెమలి. చాలా అందమైంది, బలమయింది, తెలివైంది. అందుకే పక్షులు నెమలిరాజుగారి అడుగు జాడలలో మసలుతూ సుఖంగా వున్నాయి. చిత్రవర్ణుడి మాట "సుగ్రీవాజ్ఞ"గా అవన్నీ పాలిస్తున్నాయి.

తననే నమ్ముకొని వున్న ఆ పక్షులు అన్నింటినీ చిత్రవర్ణుడు కంటికి రెప్పవలె కాపాడుతున్నాడు.

నెమలిరాజావారి ఆస్థానంలో కోయిల గాన కచ్చేరీలు జరిగేవి. గోరు వంకలు, చిలుకలు పురాణ ప్రవచనములు చేసేవి. మైనాలు కథలు చెప్పేవి.

దేశాటనం చేస్తూ వింధ్యపర్వతం వద్దకు వెళ్ళిన దీర్ఘముఖుని ఆ పక్షులు

వింతగా చూశాయి. అంతకుముందు అవి జలపక్షిని చూడలేదు. పైగా పొడవైన ముక్కుగల దీర్ఘముఖుడు తెల్లగా మెరిసిపోతున్నాడు.

ఏదో వింతపక్షిని గ్రహించి ఆ పక్షులు దీర్ఘముఖుని దగ్గరకు వచ్చి సంగతిని అడిగాయి.



చిత్రవర్ణుని దర్బారు

దీర్ఘముఖుడు తాను దేశాటనం చేస్తున్నానని వివరాలు చెప్పాడు. ఆపై అతనిని అతిథిగా ఆహ్వానించాయి. దీర్ఘముఖుడు ఆ చిలుకల ఆహ్వానాలు, మైనాల స్వాగతవచనాలు, కోయిలల కైవారాలు విని పొంగిపోయాడు. వారి అతిథిగా వుండడానికి అంగీకరించాడు.

దీర్ఘముఖునికి చక్కటి మల్లి పందిరిలో విడిది ఏర్పాటు చేశారు. తేనెలు విందుచేశారు. నృత్యగానాలతో వినోదం కలిగించారు. చక్కటి కథలు చెప్పారు. తమ రాజ్యంలోని వింతలూ, విశేషాలూ చూపించారు. చాలా రోజులు గడిచాయి.

అంతవరకు ఆ పక్షులు దీర్ఘముకునితో ఎంతో మర్యాదగా, స్నేహంగా, సన్నిహితంగా మసిలాయి. ఒకనాడు దీర్ఘముకుడు తిరిగి వెళ్ళిపోవాలని చెప్పాడు.



చిత్రపట్టునితో మాట్లాడుతున్న అరుణముఖుడు (చిలుక)

అప్పుడు అవి తమ రాజుగారి భవనమును దూరము నుండి చూచి, ఆ వైభవమును వర్ణించి ఇట్లు అడిగాయి.

"ప్రియగౌరవనీయ మిత్రమా! దీర్ఘముఖా! ఇన్ని రోజులు మా రాజ్యంలో వుండి అన్నీ చూశావు. ఇవాళ మా నెమలి రాజావారి భవనం చూచావు. మీ

రాజ్యం బాగుందా? మా రాజ్యం బాగుందా? మన రెండు రాజ్యాలలో ఏది ఉత్తమమైంది? మన రాజావార్లలో ఎవరు గొప్పవారు? సందేహించక నీ అభిప్రాయాన్ని నిర్భయంగా వివరించుము."

ఆ పక్షి స్నేహితుల మాటలు వినిన దీర్ఘముకుడు తొలుత ఏ మాట చెప్ప



హిరణ్యగర్భుని దర్శనమునకు వచ్చిన దీర్ఘముఖుడు

టానికి సందేహించాడు. తమ రాజావారి ఘనత చెప్పడం తన కర్తవ్యం. పరాయి రాజును నిందించడం తప్పు. కేవలం తమ రాజ్యం గురించి మాత్రమే మాట్లాడనప్పటికి మంచిదికాదు. ఏమీ చేయడానికి పాలుపడలేదు. అప్పుడు ఆ పక్షులు మరల ఇలా అన్నాయి.

"మిత్రమా! సందేహించకు. మన రాజ్యములలో యేది మేలైనదీ చెప్పు. నీ అభిప్రాయాన్ని చెప్పటానికి వెనుదీయవద్దు."

ఆ పక్షులు బలవంతం చేయడంతో దీర్ఘముకుడు చివరకు ఈ విధంగా చెప్పాడు.

"నేస్తులారా! మీది పర్వతరాజ్యం. మానససరోవరంలాంటి సరస్సు తామరలు, కలువలు వికసించి కనులపండువ చేస్తుండే సీమ మాది. మీ రాజ్యంలా కాదు. మిట్టపల్లాలు, రాళ్ళు, రప్పలు, గోతులు గీనటగా పెరిగిన చెట్లు, చేమలు, పొదలు, డొంకలు పైగా క్రూరమృగాల బాధ ఈ విధముగా మీ రాజ్యానికి మా రాజ్యానికి దోమకు, ఏనుగుకు మధ్యగల తేడావుంది. అలాగే మీ రాజుకు మా రాజుకు ఇసుకరేణువుకు, పర్వతమునకు గల తేడా వుంది. మా రాజుగారు తామర తూడలు భుజిస్తాడు. ఎప్పుడైనా దొరికితే పాముల్ని ఆరగిస్తాడు.

మా రాజువారి కొలువులో మహాపండితులైన పక్షులున్నాయి. సర్వశాస్త్రాలు తెలిసిన సారస పక్షులున్నాయి. వినయ విధేయతలుగల బాతులు, సూక్ష్మదృష్టిగల కొంగలున్నాయి.

మీ రాజావారి పరివారములో కుప్పిగంతులు వేయు నెమలి భాములున్నాయి. లల్లాయి పదములు పాడు కోయిలలున్నాయి. పోసుకోలు మాటలు చెప్పు చిలుకలున్నాయి. వేయేల మా రాజ్యం ముందు మీ రాజ్యం యెందుకూ కొరకాదు. అమృతానికి, సారాయికి గల తేడా ఎంత వున్నదో మన ఉభయ రాజ్యముల మధ్య అంత భేదం వుంది."

తమ రాజ్యాన్ని, రాజును కించపరుస్తూ, అవమానపరుస్తూ మాట్లాడిన దీర్ఘముకునిపై ఆ పక్షులు కోపగించాయి. అవి నలువైపుల నుంచి దానిపై దాడి చేశాయి. దాన్ని చంపవలెనని ప్రయత్నించాయి. ముక్కులతో పొడిచాయి కాళ్ళతో రక్కాయి.

"ఇన్ని రోజులుగా మా తిండి తిని మమ్మే నిందిస్తావా? మా రాజ్యాన్ని అవమాన పరుస్తావా? మా రాజావారిని తక్కువచేసి మాట్లాడతావా? నిన్ను వదలి

పెట్టం నీ ప్రాణాలు తీస్తాం" అని పక్షులు దీర్ఘముకుని చుట్టూ తిరుగుతూ రొద చేస్తూ నానాభీభత్సం చేశాయి.

దీర్ఘముకుడు భయపడక వాటితో తీవ్రంగానే పోరాడాడు. అంత పోరాటములో కూడా అది తన హంస రాజావారిని పొగడుతునే వున్నాడు. దాంతో కోపగించిన ఆ పక్షులు దీర్ఘముకుని బంధించి తమ రాజైన చిత్రవర్ణుని దగ్గరకు తీసుకు పోయాయి.

చిత్రవర్ణుడు కొలువుదీరి యున్నాడు. రాజ్యంలోకి కొత్త అతిథి వచ్చాడని విన్నాడు కాని చూడలేదు. అరుదైన అతిథిని అంత దయనీయ స్థితిలో చూడవలసి వస్తుందని నెమలిరాజు ఆలోచించలేదు. కాని మన ఆశలు వేరు, జరిగినది వేరుకదా.

బంధించి తనముందు నిలిపిన దీర్ఘముకుని, అతడ్ని తీసుకువచ్చిన పక్షులను చూసి విషయమేమిటని నెమలి రాజు చిత్రవర్ణుడు అడగ్గా పక్షులు ఇట్లా చెప్పాయి.

"మహారాజా! వీడు కర్పూరద్వీప నివాసి, వీరి రాజు హిరణ్యగర్భుడట. అతను మహాబలవంతుడట. వీరి రాజ్యం మన రాజ్యం కన్నా గొప్పదట. పైగా వారి రాజావారు మీకన్నా గొప్పవారట తెల్లటివాడట. క్షీర నీరన్యాయం చేయగల సమర్థులట. మీరు కొరగాని వారట ఈ నీచుణ్ని చంపేయండి ప్రభూ. మిమ్మల్ని, మీ పరిపాలనను, మన రాజ్యాన్ని అవమానించిన రాజద్రోహి వీడు. వీడిని చంపేయండి."

పక్షులమాట విని చిత్రవర్ణుడు క్షణంసేపు ఆలోచించి తమ మంత్రి అయిన దూరదర్శి అను గ్రద్దను చూశాడు. రాజావారి మనస్సును గుర్తించిన దూరదర్శి కూడా కొంచెం సేపు ఆలోచించి ఇట్లా చెప్పాడు.

"మహారాజా! ఇది జంబూద్వీపం, దీంట్లో కర్పూరద్వీపం సామంత రాజ్యం మీరే దానికి చక్రవర్తులు గనుక కర్పూరద్వీప చక్రవర్తియైన హిరణ్యగర్భుడు మీకు కప్పం చెల్లించాలి. ఇక జాగుచేయక అచటికి రాయబారిని పంపాలి.

చిత్రవర్ణునికి ఆస్థానములోని అరుణముకుడు అనే చిలుక కూడా ఆ మాటనే బలపరచాడు. అంతేకాక మరొక మాటకూడా చెప్పాడు.

"మహారాజా! పెద్దలు చెప్పిన హితవును గురించి మీకు వివరిస్తాను. అదే మన-



యుద్ధానికి బయలుదేరిన హిరణ్యగర్భుని సైన్యం

"అసంతుష్టోద్విజోనష్టః
సంతుష్టోపి నరాధిపః
సలజ్జా గణికా నష్టా
నిర్లజ్జాపి కులాంగనా॥"
అనగా అర్థము చెప్తాను వినండి.



"బ్రాహ్మణుడు అసంతృప్తివలన నష్టపడతాడు. రాజు సంతృప్తి వలన నష్టపడతాడు. సిగ్గువలన వేశ్య నష్టపడుతుంది. సిగ్గు విడిచినట్లయితే కులస్త్రీయైన గృహిణి నష్టపడుతుంది. గనుక రాజు తన రాజ్యంతోనే తృప్తిపడక ప్రక్కరాజ్యం జయించాలి. సంపన్నులైన సామంతరాజులను సంపాదించాలి. అంచేత మీరు హిరణ్యగర్భుని చెంతకు రాయబారిని పంపండి, కప్పం చెల్లించి మనకు సామంతుడవుతాడో, లేక యుద్ధమునకు సిద్ధపడతాడో తెలుసుకోండి."



మంత్రితో సంప్రదించుచున్న చిత్రవర్ణుడు

అరుణముకుని మాటలు విని చిత్రవర్ణుడు పొంగిపోయాడు. తన సామ్రాజ్యాన్ని విస్తరించుకోవలెనని ఆ రాజు భావించాడు.

"అట్లే చేద్దాం. మన పరాక్రమం చూపిద్దాము" అని నెమలి క్రేంకారము చేసింది.



దానిపై దీర్ఘముకుడు కోపగించి బిగ్గరగా యిలా అన్నాడు. "మా రాజు పరాక్రమమున తీసిపోయినవాడు కాడు. యుద్ధములోనే మన తగవు తీర్చు కొందాం."

కొంగ మాటలు విని చిత్రవర్ణుని సభలో అందరూ కిలకిల నవ్వారు. అప్పుడు దూరదర్శి వారిని శాంతింపజేశాడు.



చిత్రవర్ణుని దర్శించుకున్న దీర్ఘముఖుడు

"మహారాజా! మన అభిప్రాయము సాకల్యంగా హిరణ్యగర్భునకు తెలియజేయాలి కనుక రాయబారిని పంపుదాం. పండితుడు, కుశాగ్రబుద్ధి అయిన అరుణముకుడే దానికి తగినవాడు" అని దూరదర్శి సలహా చెప్పాడు.

అందుకు అరుణముకుడు అంగీకరించాడు. కాని "దుష్టబుద్ధిగల దీర్ఘ

ముకునితో కలసివెళ్ళను" అన్నాడు. తర్వాత కర్పూరద్వీపమునకు పోతాను అని చెప్పాడు.

తర్వాత దీర్ఘముకుని విడిచిపెట్టారు. దీర్ఘముకుడు కర్పూరద్వీపానికి పోతూ యిలా అన్నాడు.

"మా సైన్యం మిమ్ము ముప్పుతిప్పలు పెట్టకమానదు. మా రాజు పరాక్రమంతో విజృంభించి మిమ్ము చీల్చి చెండాడక మానడు. అకారణముగా మీరు మాతో శత్రుత్వము వహించారు. నన్ను హింసించారు."

అందుకు దూరదర్శి ఇలా అన్నాడు. "దీర్ఘముఖా! కర్పూరద్వీపం మాకు సామంతరాజ్యం. నీవు వినయంగా వుండవలసింది. మీ రాజును పొగిడావు. పైగా చిత్రవర్ణ చక్రవర్తిని నిందించావు. ఇక వాగవద్దు వెళ్ళు. యుద్ధమే మన శక్తి యుక్తుల్ని తేలుస్తుంది."

సభలో అందరూ పరిహాసపూర్వకంగా నవ్వుతుండగా దీర్ఘముకుడు ఎగిరి పోయాడు. కర్పూరద్వీపం చేరి తమ రాజయిన హిరణ్యగర్భునకు ఆ వివరం చెప్పినాడు.

## యుద్ధ ప్రయత్నాలు

దీర్ఘముకుని ద్వారా చిత్రవర్ణుని అహంకారం సంగతి తెలుసుకొన్న హిరణ్యగర్భుడు మండిపడ్డాడు. ప్రతీకారం తీర్చవలెనని భావించాడు. యుద్ధంచేసి ఆ పక్షుల పొగరు అణచాలని భీష్మ ప్రతిజ్ఞ చేశాడు. అప్పుడు మంత్రి అయిన సారస పక్షి సర్వజ్ఞుడు రాజుగారిని శాంతపరచి ఇట్లు చెప్పాడు.

"మహారాజా! తొందరపడవద్దు. మన దీర్ఘముకుడు కూడా నోటి దురుసుతనము ప్రదర్శించి, వారిని అవమాన పరిచాడు. మన గొప్పతనం చెప్పుకోటానికి పై వారిని నిందించనవసరం లేదు. కాని దీర్ఘముకుడు ఆ నియమం మరచి వారిని కించ పరచి కోపం తెప్పించాడు. ఇప్పుడు జరిగిందానికి విలపించి ప్రయోజనం లేదు. కాని తొందరపడక నిదానంగా వ్యవహరించాలి."

అనగా విని హిరణ్యగర్భుడు "ఇప్పుడు కర్తవ్యం ఏమిటి?" అని ప్రశ్నించాడు. అందుకు సర్వజ్ఞుడు ఈ విధంగా బదులు చెప్పాడు.

"మహారాజా! శత్రువు బలం తెలుసుకొన్న తరువాతనే యుద్ధం ప్రకటించాలి. గనుక జంబూద్వీపానికి పోయి చిత్రవర్ణుడు చేసే యుద్ధప్రయత్నాలుగూర్చి వివరాలు రహస్యంగా తెలుసుకొని మనకు సమాచారం తెలియజేసే గూఢచారిని పంపాలి. అందుకు తగినవాడు ఈ దీర్ఘముకుడే.



దీర్ఘముఖుని జంబూద్వీపమునకు హిరణ్యగర్భుడు పొమ్మని అనుజ్ఞ ఇచ్చుచున్నాడు.

సర్వజ్ఞుని మాటలు విని దీర్ఘముకుడు సంతోషించాడు. తనను అవమానించిన ఆ పక్షులపై పరోక్షంగా పగ తీర్చుకొనే అవకాశం వచ్చిందని ఆనందించాడు. తనకు అప్పగించిన ఈ బాధ్యతను తప్పక నెరవేరుస్తానని దీర్ఘముకుడు చెప్పాడు.

హిరణ్యగర్భుడు సంతోషించి దీర్ఘముఖునికి అనుజ్ఞ ఇచ్చాడు. దీర్ఘ ముఖుడు ఆ రోజే బయలుదేరి జంబూద్వీపానికి ఎగిరి పోయాడు.

దీర్ఘముఖుడు వెళ్ళిన కొద్దిసేపటికి జంబూద్వీపం నుంచి అరుణాముఖుడు వచ్చాడు. హిరణ్యగర్భుని కలిశాడు. హంసరాజు ఆ దూతకు అన్ని విధాల రాజ సత్కారములుచేసి సంగతిని అడిగాడు. అప్పుడు అరుణముఖుడు ఇలా చెప్పాడు.



యుద్ధ సన్నాహాలు

"మహారాజా! జంబూద్వీప మహాసామ్రాజ్యానికి చిత్రవర్ణుడే నెమలి ప్రముఖుడు చక్రవర్తి. ఈ ద్వీపంలోనిదే మీ కర్పూర దేశంగనుక మీరు మాకు సామంతరాజు. ఇకనుంచి ప్రతియేటా మీరు మాకు కప్పం కట్టాలి. ఇది మీకు అంగీ గారం కాకపోతే మాతో యుద్ధం తప్పదు. ఇది మా చిత్రవర్ణులవారి సందేశం."

చిలుక ఈ మాటలు చెప్పి హంసరాజుకు చిత్రవర్ణుడు ఇచ్చిన లేఖను అందించింది. హిరణ్యగర్భుడు ఆ ఉత్తరం చదివి ఇట్లు చెప్పాడు.

"రాయబారీ! మేము స్వతంత్ర ప్రభువులం. మీకు కప్పం చెల్లించవలసిన అవసరం మాకులేదు. మీ రాజావారితో యుద్ధానికి మేము సిద్ధమే. ఈ వివాదాన్ని



లేఖ తెచ్చిన దీర్ఘముఖుడు వాదించుచున్న అరుణముఖుడు

యుద్ధంలోనే తేల్చుకోగలం. నువ్వు వెళ్ళవచ్చు. యుద్ధమే మా నిశ్చయమని మీ రాజావారికి చెప్పు."

హిరణ్యగర్భుని మాటలు విని అరుణముకుడు "వల్లె" అని యెగిరి పోయాడు.

ఆ తరువాత హిరణ్యగర్భుడు తన మంత్రి అయిన సర్వజ్ఞునితో యుద్ధ ప్రయత్నాలు గురించి యోచించాడు. "వెంటనే యుద్ధానికి పోవలె" అని రాజు తొందరచేయగా సర్వజ్ఞుడు రాజుకు యుద్ధనీతిని వివరిస్తూ ఇలా చెప్పాడు.

"మహాప్రభూ! తొందర పనికిరాదు. శత్రువును సామ, దాన, భేద దండోపాయాలతో జయించాలి. చిత్రవర్ణుడు నెమ్మదిగా చెప్తే వినడు. అతను స్వతంత్రుడు గనుక దానం తీసుకోడు. భేదోపాయం పారు అవకాశం లేదు. ఇక యుద్ధం తప్పదు గనుక మనం చక్కటి కోటను నిర్మించుకొని సైన్యాన్ని బలపరుచుకొని అప్పుడు యుద్ధమునకు నగారా మ్రోగించాలి. అందుచేత ఎత్తయిన కొండపై ఎవ్వరూ ప్రవేశించే వీలులేని విధంగా కోటను నిర్మింపజేద్దాం. మీరు కొంచెం ఓపిక పట్టండి."

మంత్రి మాటలువిని హిరణ్యగర్భుడు తొందరపాటు తగ్గించుకొన్నాడు. ఆ తరువాత వీరవరుడు అనే చక్రవాక పక్షిని పిలిచి దుర్భేద్యమైన కోట నిర్మింప చేయమని పురమాయించాడు. వీరవరుడు అక్కడకు సమీపంలోని అడవిని గాలించి ఒక కొండపక్కగల పాతకోటను చూచాడు. దానిని బాగుచేయించాడు. అది పెద్ద కోట, ఎంతో బలమైనది! శత్రువు దానిని యేమీ చేయలేడు.

వీరవరుని పర్యవేక్షణలో ఆ కోట ఎంతో బాగైనది. రకరకాల జల పక్షులు కోటలో కాపురం పెట్టాయి. వాటికి తగిన సైనిక శిక్షణ ఇవ్వాలి. ఇది ఒక సమస్య అయింది.

## నీలవర్ణుడు

ఇక్కడ హిరణ్యగర్భుని కొలువులో యుద్ధ ప్రయత్నాలు గురించి చర్చలు జరుగుతున్న సమయంలోనే అక్కడ జంబూద్వీపంలో చిత్రవర్ణుని

ఆస్థానంలో శత్రువుపై ఏ విధంగా దెబ్బతీయాలి అని మంతనాలు జరిగాయి! కర్పూరద్వీపాన్ని స్వాధీనం చేసుకొని హిరణ్యగర్భుని అహంకారాన్ని అణచాలని చిత్రవర్ణుడు పట్టుదలగానే ఉన్నాడు. రాజుగారి అభీష్టం తెలిసిన దూరదర్శి అను మహామంత్రి ఈ విధంగా సలహా చెప్పాడు.

"ప్రభూ! అరుణముకుడు కర్పూరద్వీపానికి వెళ్ళాడు. వారి అభిప్రాయం తెలుసుకొని మనం ముందంజ వేయాలి. తొందరపాటు తగదు."

మహామంత్రి అయిన గ్రద్దమాటలు పూర్తి అవుతుండగానే అరుణముకుడు ఆస్థానంలోకి వచ్చాడు. అందరూ అతనివైపు ఆత్రంగా చూశారు. చిత్రవర్ణుడు సంగతి యేమిటని అడిగాడు. అప్పుడు అరుణముకుడు ఇలా చెప్పాడు.

"మహారాజా! ఆ హిరణ్యగర్భునికి ఎంత పొగరు? ఎంత సాహసం, ఎంత నిర్లక్ష్యం, మీ లేఖ చదివి మండిపడ్డాడు. జలపక్షులు వేరు, వాయుపక్షులు వేరు. మీకూ మాకూ పొత్తులేదు. మీకు మేము కప్పం చెల్లించము. యుద్ధంలోనే తేల్చుకుందాం. మేము యుద్ధానికి సిద్ధమని మీ రాజుకు తెలియజేయి" అని గద్దించి పంపాడు.

చిలుక మాటలు విని చిత్రవర్ణుడు మండిపడ్డాడు. ఇక యుద్ధమే శరణ్యమని తీర్మానించాడు. పక్షులన్నీ తమ సమ్మతిని తెలిపాయి. అప్పుడు దూరదర్శి ఇలా అన్నాడు.

"మహాప్రభూ! అందరిలోనూ యుద్ధవాంఛ ప్రబలంగావుంది. పైగా శత్రు విజయం రాజుకు ముఖ్యం కాదనను, కాని యెదిరిపక్షంవారి అనుపానులు తెలుసుకొని మనం ముందంజ వేయాలి. వారి సైనిక బలమెంత? వారి సేనాధిపతులెవరు?

వారికోట ఎక్కడ వుంది? ఏ తీరున వుంది? దానికి యెటువంటి రక్షణలున్నాయి? మొత్తం వారి సైనిక బలమెంత? ఈసంగతులన్నీ తెలుసుకోవాలి గనుక మన గూఢ చారి ఒకరిని కర్పూరద్వీపానికి పంపాలి. అతడు అక్కడ సంగతులు, హిరణ్య గర్భుని యుద్ధ ప్రయత్నాలు మనకు తెలియజేస్తుంటాడు. ఇది కుటిల నీతి. శత్రు విజయానికి ఈ నీతి తప్పదు. గూఢచారి అక్కడకుపోయి ఆ రాజునకు మిత్రునిగా మసలి రహస్యాలు సేకరించాలి."

మహామంత్రి మాటలు విని అందరు "అటువంటి శక్తియుక్తులు గలవాడు మేఘవర్ణుడనే కాకి" అని విన్నవించారు. రాజు మేఘవర్ణుని పిలిపించి సంగతిని వివరించాడు. కర్తవ్యాన్ని బోధించాడు.

కర్పూరద్వీపంలో మేఘవర్ణుడు వ్యవహరించవలసిన తీరు గురించి దూర దర్శి ఇలా వివరించాడు.

"మేఘవర్ణా! దూతపట్ల రాజులు గౌరవమర్యాదలతో ప్రవర్తిస్తారు. అందు చేత వారికి ప్రాణభయం వుండదు. గూఢచారులు అలాకాదు. వారిపని అతి క్లిష్ట మైనది. ఎక్కడా ఎవరికీ అనుమానం రాకూడదు. ఎంతో నేర్పుతో రహస్యాలు రాబట్టాలి. వాటిని మనం రాజావారికి నివేదించాలి. ఏమాత్రం అనుమానం వచ్చినా శత్రురాజులు గూఢచారిని చంపివేస్తారు."

మంత్రి మాటలు విని మేఘవర్ణుడు ఇలా అన్నాడు.

"మహామంత్రీ! మీకు యెటువంటి సందేహం అవసరంలేదు. నేను పేరు మార్చుకొని అక్కడ రాజావారి కొలువులో ప్రవేశిస్తాను. ఆ రాజ్యంలో అత్యవ సరమైన దేమిటో కనిపెట్టి ఆ విద్యలో నా ప్రావీణ్యం చూపించి, సమ్మరం కలిగి స్తాను."

మేఘవర్ణుడి మాటలకు నెమలిరాజు, గ్రద్దమంత్రి ఎంతగానో సంతోషించారు. అప్పుడు చిత్రవర్ణుడు చేయవలసిన పనులు గురించి ఇలా వివరించాడు.

మేఘవర్ణా! కర్పూరద్వీపంలో హిరణ్యగర్భుడు చేసే యుద్ధప్రయత్నాలు గురించి,వారి సైనికబలం గురించి, వ్యూహాలు గురించి వివరంగా మాకు సమాచారం పంపు. వెళ్ళిరా నీకు శుభమౌతుంది.''

రాజావారి దగ్గర అనుమతి తీసుకొని మేఘవర్ణుడు కొందరు భటులతో కలిసి కర్పూరదీపానికి వెళ్ళిపోయాడు. అది అటు ప్రయాణమై వెళ్ళింది. ఇటు వైపునుంచి దీర్ఘముకుడు కర్పూరద్వీపం నుంచి గూఢచారి పనులు చేయడానికై జంబూద్వీపంలో ప్రవేశించాడు. ఒకరి కొకరికి ఈ సంగతులు తెలియవు. దీర్ఘముకుడు ఒక కొండ గుహాలో మకాం పెట్టాడు. చిత్రవర్ణుడు చేసే యుద్ధ ప్రయత్నాలు గురించి రహస్యాలు సేకరించసాగాడు.

జంబూద్వీపం నుంచి బయలుదేరిన మేఘవర్ణుడు కర్పూరద్వీపం చేరే సమయానికి అక్కడ వీరవర్ణుడు కోట నిర్మించి కోట రక్షణకు సైనికుల శిక్షణకు నేర్పరి అయిన వీరునికై గాలిస్తున్నాడు.

ఆ కోటకు దూరంగా ఒక మర్రిచెట్టుపై మేఘవర్ణుడు తన అనుచరులతో దిగాడు. అక్కడ పరిస్థితిని అర్థం చేసుకున్నాడు. వారి అవసరం యేమిటో అతనికి అవగతమైంది. ఇక తను రంగంలో ప్రవేశించవచ్చునని భావించాడు. హిరణ్యగర్భుని కొలువులో పనిచేసే సేవకుడు ఒకరిని దగ్గరకు పిలిచి మేఘవర్ణుడు ఇలా అన్నాడు.

''ఓయీ! జలపక్షి, నేను సింహళ ద్వీపం నుండి వచ్చాను. నాపేరు నీలవర్ణుడు. యుద్ధ విద్యలు తెలిసినవాడ్ని. మీ రాజుగారైన హిరణ్యగర్భుని కీర్తి, మంచితనం గురించి విని వారిని సేవించే సంకల్పంతో వచ్చాను. నన్ను వారి దగ్గరకు తీసుకు వెళతావా?''

మేఘవర్ణుడు పేరు మార్చుకుని నీలవర్ణుడయ్యాడని, అతను జంబూద్వీప గూఢచారి అని తెలియని ఆ జలపక్షి దాని తీపిమాటలు నమ్మి ఆ కాకిని తన రాజు

దగ్గరకు తీసుకువెళ్ళింది దానిని చూసి సర్వజ్ఞుడు ఆశ్చర్యపడ్డాడు రాజైన హిరణ్యాగర్భుడు అతనెవరని ప్రశ్నించాడు.

అందుకు ఆ జలపక్షి నీలవర్ణుని పరిచయంచేస్తూ "ప్రమహాప్రభూ, ఇతడు నీలవర్ణడను పేరుడు. సింహళదేశీయుడు. మీసేవ చేయడానికై వచ్చినవాడు" అని పరిచయం చేసింది.




రాజా హిరణ్యగర్భునితో మాట్లాడుచున్న నీలివర్ణుడు

వెంటనే నీలవర్ణుడు కలుగజేసుకొని "దేవరవారికి నమస్కారం. నేను రకరకాల యుద్ధకళలు నేర్చినవాడిని. రకరకాల కోటలు వాటిని గురించి ఛేధించడం లేదా రక్షించడం గురించి తెలిసినవాడిని. తమరు అనుగ్రహించి అనుమతిని ఇచ్చినట్లయితే మీ సైనికులకు ఆ రహస్యాలు చెప్పగలను" అని విన్నవించాడు.

నీలివర్ణుని అసలు గుట్టు తెలియక హిరణ్యగర్భుడు దాని ఉపకార గుణాన్ని ఎంతగానో మెచ్చుకున్నాడు. ఆపద సమయంలో అయాచితంగా వచ్చిన సహాయాన్ని ఉపయోగించుకోనాలనుకున్నాడు. జంబూద్వీప సైన్యంతో యుద్ధం చేయవలసిన తరుణం రానున్నది. తమ సైన్యానికి యుద్ధ విద్యలలో కొంత కొత్త శిక్షణ అవసరం గనుక నీలవర్ణుడిని కొలువులో ఉంచుకోనడం ఉత్తమం అని హిరణ్యగర్భుడు భావించాడు.

ఐతే రాజుగారి అభిప్రాయాన్ని మంత్రి సర్వజ్ఞుడు అంగీకరించలేదు. పైగా యిలా అన్నాడు.

"మహారాజా! యుద్ధ సమయంలో శత్రువులు అనేక రూపాలలో వస్తారు. మిత్రులవలే నటిస్తారు. అదీకాక యీ నీలవర్ణుడు కాకి. ఇది ఆకాశపక్షి. మన జాతి కాదు. అందుచేత దీన్ని విశ్వసించడం తగదు."

మంత్రి మాటలకు హంసరాజు మందహాసం చేసి యిలా అన్నాడు.

"మహామంత్రీ! మేఘుడు యెవ్వరూ అడగకుండానే వర్షిస్తాడు. చెట్లు యెవ్వరూ కోరకుండానే ఫలాల నిస్తాయి. సూర్యచంద్రులు యెవరి ప్రార్థన లేకుండానే కాంతినీ, వెన్నెలనూ ప్రసరించి జీవసృష్టికి కారకులవుతున్నారు. అది మహాపురుషుల లక్షణం. అలాగే ఈ కాకి మనకు అయాచితంగా సహాయం చేయాలని వచ్చింది. అంతేకాక మనం ఇప్పుడు యుద్ధం చేయబోతున్నాం"- రాజు క్షణకాలం ఆగి మరల యిలా అన్నాడు.

"మనం ఆకాశపక్షులతో యుద్ధం చేయబోతున్నాం. ఇంతకాలము మన సైన్యానికి జలయుద్ధమే తెలుసు. ఇప్పుడు కొత్తగా అవి ఆకాశ పక్షులతో యుద్ధం చేయాలి. ఇది మనకు తెలియని విద్య. గనుక ప్రత్యేక శిక్షణ అవసరం. ఈ నీలవర్ణుడు ఆకాశపక్షి గనుక దాని దగ్గర మన సైన్యానికి ఈ కొత్త పద్ధతులు నేర్పిద్దాం. అయాచితంగా వచ్చిన పెద్దలను తిరస్కరించరాదు."

హిరణ్యగర్భుని మాటలను సభలోని వారందరూ అంగీకరించారు. సర్వజ్ఞుడు ఎంత చెప్పినా ఎవరూ పట్టించుకోలేదు. నీలవర్ణుడు తన ఎత్తు పారిందని లోలోన సంతోషించాడు.

ఆనాటి నుండి జలపక్షులకు సైనిక శిక్షణ ఇచ్చే పేరున వారి బలాన్ని అంచనా వేసి వారి రహస్యాలను అతి చాకచక్యంగా జంబూద్వీపానికి చేర వేయిస్తూ వచ్చాడు.

నీలవర్ణుడు హిరణ్యగర్భునికి ఉన్న రకరకాల సరస్సులను చూశాడు. అక్కడి జలపక్షుల శక్తి సామర్థ్యాలను అంచనా వేశాడు. కొత్తగా కట్టిన కోట సంకించిన రహస్యాలు తెలుసుకొన్నాడు. ఆ కోట చుట్టూ ఉన్న కందకాలు చూశాడు. కోటలో నుంచి తప్పించుకునే గుహామార్గం గుట్టు తెలుసుకున్నాడు. అన్ని వివరాలను తమ రాజైన చిత్రవర్ణునికి చేర వేయించాడు.

హిరణ్యగర్భుని సేనాబలం, రక్షణ వ్యూహాలు గురించి తెలుసుకొన్న చిత్రవర్ణుడు తనమంత్రి అయిన దూరదర్శిని పిలిచి యుద్ధానికి ముహూర్తం పెట్టించమన్నాడు.

అప్పుడు దూరదర్శి యిలా అన్నాడు, "మహాప్రభూ! ముహూర్తం పెట్టిస్తాను. కాని యుద్ధంలో అనుసరించవలసిన రెండు మాటలున్నాయి వినండి. యుద్ధంలో పరాక్రమం యెంత ముఖ్యమో కుటిలనీతి కూడా అంతే ముఖ్యం. శత్రు రాజ్యంలో కల్లోలం సృష్టించాలి. ఆ రాజు కోశాగారాన్ని కొల్లగొట్టాలి. ఆయన శత్రువుల్ని మనవైపు త్రిప్పుకోవాలి. మర్యాదస్తుల్ని అవమానించాలి. ఆహార పదార్థాలు దాచిన స్థలాన్ని దోపిడి చేయాలి, కోటల్ని నాశనం చేయాలి — అని ఆగి దూరదర్శి తిరిగి ఇలా వివరించాడు.

ముందుగా పదాతిదళం నడవాలి. వారి వెనుక ఏనుగుసైన్యం ఉండాలి. ఆ వెనుక అశ్వసైన్యం ఉండాలి. మధ్యన రాజు ఉండాలి. రాజుదగ్గరే కోశాధికారి ఉండాలి. సైన్యాన్ని ఎప్పటికప్పుడు ప్రోత్సహించే భట్రాజులుండాలి"

మహామంత్రి మార్గదర్శనం మాటల్ని అందరూ శ్రద్ధగా విన్నారు. యుద్ధ భేరీలు మ్రోగించారు. జయజయధ్వానాలు చేశారు. ఈ కోలాహలాన్ని పసిగట్టిన దీర్ఘముకుడు ఇక ఆలస్యం చేయరాదని వెంటనే కర్పూరద్వీపానికి ఎగిరిపోయాడు!

చిత్రవర్ణుడి యుద్ధయాత్ర గురించి తన రాజైన హిరణ్యగర్భుడికి హెచ్చరిక చేయటానికి దీర్ఘముకుడు ప్రయాణమైనరోజునే అక్కడ కర్పూరద్వీప రహస్యాలు అన్ని తెలుసుకొన్న నీలివర్ణుడు హఠాత్తుగా మాయమైనాడు. అతను మేఘవర్ణుడుకద! మేఘవర్ణుడు జంబూద్వీపం చేరి తన రాజు చిత్రవర్ణునకు హిరణ్యగర్భుని యుద్ధప్రయత్నాలు గురించి ముఖాముఖి మరల వినిపించాడు.

## యుద్ధం

హిరణ్యగర్భుడు యిక్కడ సకల విధాలయిన యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నాడు. హంస సైన్యాలు, బాతు సైనికులు, కొంగ సైనికులు, కారండపక్షులు, చక్రవాక సైనికులు ఒకటేమిటి అన్నిరకాల జలపక్షులు యుద్ధానికి కాలు దువ్వుతున్నాయి. అన్నీ బారులుతీరి రాజైన హిరణ్యగర్భునికి, మంత్రి అయిన సర్వజ్ఞునికి సేనాధిపతి అయిన సారసునికి సైనిక వందనం చేశాయి. తమ శక్తియుక్తుల్ని ప్రదర్శిస్తూ కవాతుచేశాయి. ఆ కోటంతా యుద్ధోత్సాహంతో మారుమ్రోగుతోంది.

భేరీలు మ్రోగుతున్నాయి. శంఖనాదాలు సాగుతున్నాయి. ఘాంకారధ్వని మిన్నుముడుతోంది. యుద్ధం కాకుండానే తమకే విజయం వరించినట్లు పక్షులు జయగీతికలు ఆలాపిస్తున్నాయి.

ఇంతలో ఒక భటుడువచ్చి "మహాప్రభూ నీలవర్ణుడు కనిపించడం లేదు" అని చెప్పాడు. ఆ మాటపై కలకలం బయలుదేరింది. అందరు అనేక రకాలుగా వాదులాడుతుండగా జంబూద్వీపం నుండి దీర్ఘముకుడు వచ్చాడు.

అతడిని చూసి అక్కడి విశేషాలు వినాలన్న కుతూహలంతో అందరు మౌనం వహించారు. దీర్ఘముకుడు రాజుగారికి, మంత్రిగారికి నమస్కరించి ఇలా అన్నాడు.

"మహారాజా! చిత్రవర్ణుడిది అపారమైన ఆకాశపక్షి సైన్యం. అతడు యుద్ధానికి బయలుదేరి వస్తున్నాడు. అయితే నాకు ఆశ్చర్యం కలిగించిన వింత ఒకటి వుంది. అదేమంటే కర్పూరద్వీపంలోని రహస్యాలు, సైనిక సంచలనాలు గురించి ఆ రాజుకు యెప్పటికప్పుడు తెలిసాయి. మన కోట రహస్యం కూడా వారికి తెలిసిపోయింది."

దీర్ఘముకుని మాటలతో మరల గొడవ బయలుదేరింది. అనేక రకాలుగా మాటలు సాగాయి. విమర్శలు వచ్చాయి. అందరినీ సమాధానపరచి సర్వజ్ఞుడు ఇలా అన్నాడు.

"సైనికులారా! శాంతించండి. మనలో యెవ్వరూ ఈ రహస్యాలను జంబూద్వీపానికి అందజేశారని మేము అనుమానించడంలేదు. మన పౌరులపట్ల, సైనికులపట్ల మాకు విశ్వాసం ఉంది. ఐతే పరాయివాడెవరో మనమధ్య మసలి ఈ రహస్యాల్ని అక్కడకు చేరవేశాడు. ఆ పని చేసింది నీలవర్ణుడని నా నమ్మకం. ఆనాడే నేను చెప్పాను. ఆకాశపక్షిని నమ్మవద్దని, పోనిండు ఇక ఇప్పుడు మనం చాలా జాగ్రత్తగా యుద్ధం చేయాలి. క్రమశిక్షణతో-ఐకమత్యంతో పోరుసాగించాలి. విజయమో, వీరస్వర్గమో మన ఆదర్శం."

సర్వజ్ఞుని గంభీరోపన్యాసంతో జలపక్షులకు ఉత్సాహం వచ్చింది. వాటిలో రణదీక్ష తాండవించింది. తమరాజ్యాన్ని-రాజును కాపాడుకోవాలనే తపన పెరిగింది.

"జై హిరణ్యగర్భ మహారాజా జై! సర్వజ్ఞ మహామంత్రీ! జై! జల మహారాజ్యమా" అని ఆ పక్షి సైనికులు జయజయధ్వానాలు చేశాయి. సమర గీతాలు గానం చేశాయి.



కోటకు నిప్పు పెట్టుచున్న నెమలి సైన్యాలు

ఇటు జలపక్షులు దండయాత్రకు బయలుదేరాయి. అటునుండి ఆకాశ పక్షులు యుద్ధానికి వచ్చాయి. రెండు జాతుల పక్షులు ఘోరయుద్ధం చేశాయి. ఎన్నో వందల పక్షులు నేలకూలాయి. కొన్నింటి రెక్కలు తెగి పోయాయి. కొన్నింటి తోకలు ఊడిపోయాయి. కొన్నిటి కాళ్ళు విరిగాయి. ఇంకా కొన్నింటి

మెడలు గాయపడ్డాయి. కొన్ని పక్షులు గ్రుడ్డివై అలమటించాయి. కొన్ని కుంటివై అల్లల్లాడాయి. మరికొన్ని రెక్కలు పోయి విలవిల లాడాయి.

యుద్ధ రంగం అంతా పక్షుల కోలాహలం, వాటి ఆర్తనాదాలు, రెక్కల "టపటప" చప్పుళ్ళతో నానాభీభత్సంగా వుంది.

ఆకాశపక్షులు రాజు చిత్రవర్ణుడు దూరంలో వుండి అంతా చూస్తున్నాడు. హిరణ్యగర్భుడు మాత్రం కోటలోవుండి యుద్ధవార్తలు వింటున్నాడు. ఎదిరిపక్షము లోని సైనికుల పరాక్రమం తమ పక్షిదళాల విజృంభణ గురించి గూఢచారులు ఆయ నకు వివరించి చెపుతున్నారు.

ఇంతలో సాయంకాలం అయింది. ఉభయపక్షాలవారు యుద్ధ విరమణ గంట మ్రోగించారు. సూర్యోదయం తర్వాత యుద్ధం చేయడం సూర్యాస్తమయం అవగానే యుద్ధాన్ని విరమించడం ఆనాటి నీతి. చీకటివేళ యుద్ధం చేయరాదని ఆనాటి యుద్ధ నీతి.

ఆ ప్రకారం అటు ఆకాశపక్షి సైన్యం యుద్ధం విరమించింది. ఇటు జల పక్షి దళాలు వెనక్కు తగ్గాయి. ఉభయులు ఆనాటి నష్టాలు గురించి తనిఖీలు చేసుకొంటున్నారు.

అర్ధరాత్రి అయింది. ఆ సమయంలో మేఘవర్ణుడు బయటకు వచ్చాడు. పగలంతా అతను దాగొని వున్నాడు. అందరు విశ్రమించినవేళ మేఘవర్ణుడు లేచి హిరణ్యగర్భుడు ఉన్న కోట దగ్గరకు వెళ్ళాడు. ఆ కోటలో జలపక్షి సేనలు నిద్ర పోతున్నాయి. మేఘవర్ణుడు ఆ కోటలోని గదులు తలుపులు బంధించి ప్రగతికి నిప్పుపెట్టి ఎగిరిపోయాడు.

మంటలలో చిక్కుకొని బయటపడే మార్గంలేక జలపక్షులు కుత కుత ఉడికి చచ్చిపోయాయి.

హిరణ్యగర్భుడు, సర్వజ్ఞుడు మాత్రం యెట్లాగో తప్పించుకొని ప్రాణా లతో బయటపడి "పద్మకేళి" అనే తమ సరస్సులో చేరారు.

తెల్లవారింది. జలపక్షి సేనలు కొద్దిగా మాత్రం మిగిలివున్నాయి. తామ్రచూడుడు అనే కోడిపుంజు తన సేనతో దాడిచేసింది. అప్పుడు జలపక్షుల సేనాని సారసుడు ముందుకు వచ్చాడు.

కోడిపుంజు సేనలు, సారసపక్షి సేనలతో తలపడ్డాయి. ముక్కులతో పొడుచుకున్నాయి. రెక్కలతో ఢీకొన్నాయి. కాళ్ళతో గిరుకున్నాయి.



కోడిపుంజుల సైన్యం హిరణ్యగర్భునితో తలపడుట

తామ్రచూడుడు బలంగా విజృంభించి సారసునిపై విరుచుకొని పడ్డాడు. భయంకరంగా ఇద్దరూ పోరాడారు.

తామ్రచూడుని సేనలు సారసుని సేనలను దెబ్బతీశాయి. వాటి రక్తముతో సరస్సు ఎర్రబడింది.

ఇంతలో తామ్రచూడుడు బలమైన తన కాళ్ళతో సారసుని పీకపై పొడిచాడు. ముక్కుతో కళ్ళు పొడిచాడు. సారసుడు 'హాహాకారం' చేస్తూ ప్రాణాలు వదిలాడు.

తమ సేనాధిపతి, మహావీరుడయిన సారసుడు మరణించడం చూచి హిరణ్యగర్భుడు వేగంగా వచ్చి తామ్రచూడునిపై పడ్డాడు. హిరణ్యగర్భుడు ఎన్నో కోడిపుంజులను సునాయాసంగా చంపాడు. ఈలోగా వీరవర్ణుడు వచ్చి మరి కొన్నింటిని తీవ్రంగా గాయపరిచాడు. గాయాలతో విలపిస్తూ కోళ్ళు వెళ్ళి చిత్ర వర్ణునికి సంగతిని చెప్పాయి.

చిత్రవర్ణుడు రెక్కలు అల్లల్లాడించి తన పరాక్రమం ప్రదర్శించే సమయం వచ్చిందని ఆనందించి ఒక్క ఉదుటున ఆకాశంలో ఎగిరి యుద్ధనాదం చేస్తూ క్రీంకారం చేశాడు.

చిత్రవర్ణుడు వచ్చేలోగానే హిరణ్యగర్భుడు తామ్రచూడుణ్ణి కాళ్ళతో పొడిచి భయంకరంగా చంపాడు. ఇంకా ఎన్నో పక్షుల్ని హతమార్చాడు. వీర వర్ణుడు భయంకరంగా పోరాడాడు.

కోడి సేనలు హిరణ్యగర్భుని ధాటికి ఆగలేకపోయాయి. తోకలు ముడిచి పారిపోబోయాయి. అప్పుడు వారికి తమ రాజైన చిత్రవర్ణుని మాట విని పించింది.

"కోడి సేనలారా! పారిపోబోకండి. నేను వచ్చాను! ఈ హిరణ్యగర్భుని గర్వం అణుస్తాను పోరాడండి."

చిత్రవర్ణుని హెచ్చరికతో కోడిపుంజులు మరల ఉత్సాహంగా తిరగ బడ్డాయి. జలపక్షులకు, కోడిపుంజులకు ఘోరంగా యుద్ధం జరిగింది. రెండు వర్గాల లోనూ యెన్నో వందల పక్షులు మరణించాయి.

చిత్రవర్ణుడు విపరీత వేగంతో వచ్చి హిరణ్యగర్భునిపై దెబ్బతీశాడు. పొడవైన తన కాలిగోళ్ళతో ఆ తెల్లటి హంస రాజుగార్ని రక్కాడు. ముక్కుతో పొడిచాడు. చాలా రకాలుగా ఆకాశంలో యెగురుతూ క్రిందకు వస్తూ హంసని ముప్పుతిప్పలు పెట్టాడు.

అప్పటివరకూ యుద్ధం చేసి, చేసి అలసిపోయిన హిరణ్యగర్భుడు నెమలిరాజు ధాటికి నిలవలేకపోయాడు. అంతేకాక హిరణ్యగర్భుని సైన్యము చెల్లా చెదురుగా పారిపోయారు. చిత్రవర్ణుని చేతిలో హిరణ్యగర్భుడు ఓడిపోయాడు. ప్రాణాలతో బయటపడ్డాడు.

చిత్రవర్ణుడి సేనలు జయ జయ ధ్వానాలు చేశాయి. తమ రాజు పరాక్రమాన్ని కీర్తించాయి. విజయోత్సవ గీతాలు ఆలపించాయి.



హిరణ్యగర్భుని యుద్ధంలో ఓడించుచున్న చిత్రవర్ణుడు (నెమలిరాజు)

కర్పూరద్వీప విజయం సాధించి చిత్రవర్ణుడు తన పరివారంతో జంబూ ద్వీపానికి వెళ్ళిపోయాడు.

ఇది "విగ్రహం" ప్రధాన కథ.

సమాన బలపరాక్రమాలు ఉన్నవారే అయినా అనవసరపు విరోధం తెచ్చుకొని చిత్రవర్ణుడు, హిరణ్యగర్భుడు ఎంతో నష్టపోయారు. కారణం పర స్పరం ఒకరికొకరు మాట్లాడుకొనకపోవడమే. పైవారు చెప్పిన మాటలు విని ఒకరిపై ఒకరు కక్షబూనారు. అందుకే ఉభయ పక్షాలలో లక్షల సంఖ్యలో పక్షులు మరణించాయి.

ఈ ప్రధాన కథతో బాటు విష్ణుశర్మ సందర్భాన్నిబట్టి పక్షులచే చెప్పిం చిన నీతికథల్ని ఇప్పుడు చదువు కొందాం.

మంచివారికి కూడా అపకారం చేయడం, ఉపకారం చేసినవారికి కీడు కలిగించడం నీచబుద్ధి. దీర్ఘ ముఖుడు అనే కొంగ జంబూద్వీపంలో చిత్రవర్ణుని సేవకులైన పక్షులకు తమ రాజు గురించి, రాజ్యం గురించి గొప్పగా చెప్పింది. దానిపై అవి ఆగ్రహించి ఆ కొంగను హింసించాయి. ఈ కథ యింతకు ముందే మనం చదివాం. అలా మంచి మాటలు చెప్పినప్పటికి తనను హింస చేయని వారికి దీర్ఘముఖుడు చెప్పిన కథ ఒకటి ఇప్పుడు చెప్పుకుందాం. ఇది నీచులైన వారి స్వభావం యెటువంటిదో వివరించే నీతికథ.

మాల్యవంతం అనే కొండ ఒకటి వుండేది. అక్కడ రకరకాల జంతు వులు నివసిస్తున్నాయి. కొండముచ్చుల దండు కూడా ఆ కొండపై నివాసం పెట్టు కొని వున్నాయి. అవి ఆ పరిసరాలలోని చెట్లపై తిరుగుతూ దొరికిన కాయా, కసరు తింటూ బ్రతుకు సాగిస్తున్నాయి. కొండ దగ్గరలోనే సరస్సు ఒకటి వుంది. దాని లోని తియ్యటి నీళ్ళతో దాహం తీర్చుకొనేవి. ఇలా నిశ్చితంగా కాలం గడిచి పోతోంది.

ఒక ఏడాది వేసవి, ఉధృతంగా ఎండలు కాస్తున్నాయి. అంతకుముందు అక్కడ వర్షాలు బాగా కురవలేదు. అందుకని ఆ పర్వత ప్రాంతంలోని నీటి చెరు వులు, సరస్సులు ఎండిపోయాయి. దాహంతీరే మార్గం దొరకక అవి విలవిలలాడు తున్నాయి.

నీటికోసం తిరుగుచున్న వాటికి అల్లంతదూరాన నీటి ప్రవాహం ఒకటి కనిపించింది. పైగా అక్కడ పొదలు, తుప్పలు పచ్చగా పెరిగివున్నాయి. దాన్ని బట్టి అక్కడ నీళ్ళు వుంటాయని అభిప్రాయపడ్డాయి. తమ కష్టం గట్టెక్కిందని సంతోషించాయి. ఆ నీటివైపు వెళ్ళాయి. ఎంత దూరం వెళ్ళినా వాటికి నీరే కని పించ లేదు. ఆయాసం మిగిలింది.



కోతులకు మేలు చేయాలనుకున్న కుందేలు కీడు పొందుట

ఏడుపు ముఖాలతో, అలసిపోయిన శరీరాలతో, తడారిపోతున్న గొంతులతో అవి పిచ్చెక్కినట్లు తిరిగి వొక చెట్టు క్రిందకు చేరాయి. క్షణకాలం సేద తీరాయి. ఇంతలో వాటికి నీటి ప్రవాహం కనిపించింది. అప్పుడు ముసలి కోతి చప్పట్లుకొట్టి "అదిగో నీరు! అటుపోదాం రండి."- అంది. కోతులన్నీ అటు బయలు దేరి పోయాయి.

ఒకనాడు వొక వేటగాడు అడవిలో వేట యేమీ దొరకక తిరిగి ఇంటికి పోతూ ఆ చెట్టు క్రింద నిద్రపోయాడు. అది వేసవికాలం, ఎక్కడా గాలి లేదు. అతనికి శరీరం అంతా చెమట పట్టింది.

స్వభావం చేత మంచిదయిన హంస అతనికి పైన కొమ్మపై నిలిచి తన రెక్కలతో విసరసాగింది. ఇంతలో అల్పబుద్ధిగల కాకి వచ్చింది. హంస చేస్తున్న పరోపకారం చూసి నవ్వింది.



మంచి చెడులను ఆలోచించక హంసను చంపుచున్న వేటగాడు

"వాడు వేటగాడు! మనల్ని బాణాలతో కొట్టి వేటాడుతాడు. వాడికి సేవచేస్తున్నావు. ఎంత పిచ్చిదానివి?"—అని పరిహసించి ఆ కాకి అతనిపై రెట్ట వేసి ఎగిరిపోయినది.

వేటగానికి మెలకువ వచ్చింది. తన ఒంటిపై రెట్టిచూసి పైకి చూశాడు! అక్కడ హంస కన్పడింది. తనపై అదే రెట్టవేసినదనుకొని ఆ వేటగాడు బాణంతో దానిని కొట్టి చంపేశాడు. కనుక అల్పులు, కుటిల బుద్ధులతో జాగ్రత్తగా వ్యవహరించాలి.

## పొగరు పనికిరాదు

ఇతరుల బలాన్ని, శక్తిని గ్రహించక పొగరుగా వ్యవహరిస్తే అది ప్రాణాంతకమే అవుతుంది. దీర్ఘముకుడు చిత్రవర్ణుని సేవకులు తనను హింసించారని చెప్పినప్పుడు హిరణ్యగర్భుడు ఈ నీతికథ చెప్పాడు.

పాండ్యదేశంలో మధుర అనే పట్టణం వుంది. ఆ పట్టణంలో మీనాక్షి ఆలయం వుంది. ఇంకా ఎన్నో దేవాలయాలు వున్నాయి. ఒక ఆలయ గోపురంపై పావురాళ్ళ దంపతులు నివసిస్తున్నారు.

వాటిలో ఒక జంట ఎంతో అన్యోన్యంగా వుండేది. వేటకు వెళ్ళినా, విహారానికి వెళ్ళినా కలిసే వుండేవి. మంచి కథలు, కబుర్లు చెప్పుకొనేవి. పరాచకాలు ఆడుకొనేవి. ఆలయంలో భక్తులు నివేదనలు చేసి వదిలి వెళ్ళిన రకరకాల ప్రసాదాలను ఇష్టపడి ఎంతో ఆనందంగా తినేవారు.

చీకూ, చింత లేకుండా వాటి కాపురం సాగిపోతోంది. మగ పావురం బాగా కండపట్టి పుష్టిగా పెరిగింది. ఆడ పావురం కూడా మాంసం పెట్టుకొని నిగనిగలాడుతూ చూసేవారికి కన్నుకుట్టేటట్లు వుంది.

ఈ పావురాళ్ళ జంటను భక్షించాలని ఒక డేగ కన్ను వేసింది. ఒకనాడు అది ఆలయం గోపురంపై వాలింది. ఏదో ఒక పావురాయిని తన్నుకొని పోవాలని దాని ఆశ. అయితే ఆ జంటపావురాళ్ళు మేతమేస్తున్న గుడి ఆవరణ అంతా జనం వున్నందున దాని ఎత్తు పారలేదు. అది చాలాసేపు వేచిచూసి, అప్పటికి తన ఎత్తు పారలేదని ఎగిరిపోయింది.

మేతమేసి, గూటికిచేరి విశ్రాంతిగా వున్న భర్తతో ఆడపావురం యిలా అంది:

"ఆ డేగ పగలంతా మనల్ని తన్నుకుపోవాలని చూస్తూనే వుంది. ఇవాళ దానికి వీలుపడలేదు. రేపైనా, మాపైనా అది మరల రాకపోదు. అందుచేత మనమే వేరేచోటుకు వెళ్ళిపోయి ప్రాణాలు కాపాడుకొందాం.



మగపావురమును తన్నుకొని ఎగిరిపోవుచున్న డేగ

భార్య భయపడి చెప్పిన మాటలు విని మగపావురం పకపకా నవ్వి, యిలా అంది.

"అంత భయం అక్కర్లేదు. ఆ డేగను ఢీకొని నేను జయించగలను. ఎవరో పైవారిని చూసి పారిపోవలసినంత పిరికివాడిని కాను."

భర్త మాటలు విన్న ఆడ పావురం యిలా అంది. "అది క్రూరమైన పక్షి. మనం సాదా పక్షులం. దానితో పోరు మనకెందుకు? వెళ్ళిపోదాం."

భార్య ఎన్ని విధాలుగా బతిమిలాడినా మగపావురం వినలేదు. పైగా ఆ డేగను పరాభవిస్తానని, ఓడించి బుద్ధిచెపుతానని ప్రగల్భాలు పలికింది.

ఇంక హితవు చెప్పి ప్రయోజనం లేదని ఆడ పావురం వూరుకుంది. కొన్ని రోజులు గడిచాయి. ఆ పావురాల జంట యథాప్రకారం మేత సంపాదించు కొంటున్నాయి. మధ్య మధ్య మగపావురం తన పరాక్రమం గురించి ప్రగల్భాలు పలుకుతూనే వుంది.

ఒకనాడు అవి ఆలయ ప్రాంగణంలో యథేచ్ఛగా మేత మేస్తున్నాయి. ఏమరుపాటున వున్నాయి. తమకేం భయం లేదని ధీమాగా వున్నాయి.

ఇంతలో డేగ వేగంగా ఎగిరి వచ్చింది. గురిచూసి మగపావురం మీదకు వచ్చి, వాడి గోళ్ళతో దాన్ని తన్నుకొని పోయింది.

ఆడపావురం వల వల యేడ్చింది. డేగ బలాన్ని తక్కువగా అంచనా వేసిన మగపావురం తన పొగరు వల్ల ప్రాణాలు కోల్పోయింది. అంచేత ఎదిరి వాడి శక్తి అంచనా వేయక బీరాలు పలికితే ప్రమాదం తప్పదు.

## పులి తోలు - గాడిద నోరు

వేషం మారినంత మాత్రాన గొంతు మారదు. నోరు విప్పితే జాతిని చెప్పవచ్చు. అయితే వేషం మార్చి, రంగు మార్చి మోసం చేస్తుంటారు. అటువంటి వారి యెత్తుగడలు యెల్లవేళలా సాగవు. వారి మోసం యేదో ఒకనాడు బయట పడకపోదు. వెలుగు వస్తే చీకటి పోతుంది. నిజం తెలిస్తే మోసం బయట పడు తుంది. ఈ నీతికి సాక్ష్యం ఇచ్చే రెండు కథలు చదువుదాం.

కాశీపురం అనే గ్రామం వుంది. అక్కడ ఒక చాకలి వున్నాడు. అతనికి బట్టలు మోసే గాడిద ఒకటి వుంది. దానికి మేత కొని వేయడం దండుగ అని చాకలి ఒక ఉపాయం ఆలోచించాడు.

గాడిదకు సరిపడే పులి తోలు సంపాదించాడు. పగలంతా చాకిరీ చేసి, ఇంటికి వచ్చాక ఆ గాడిదకు పులితోలు కప్పి వదిలేవాడు. అది దగ్గరలోని తోటల లోకి, చేలలోకి పోయి సుష్టుగా మేసి వచ్చేది. చేలు పాడైన రైతులు, తోటలు చెడి



పులితోలు కప్పుకున్న గాడిదను చూచి పారిపోవుచున్న పాలెకాపులు (పనివాళ్ళు)

పోయిన కామందులు ఎంతో బాధపడేవారు. కాని పులి కదా అని ఎవరూ దగ్గరకు వెళ్ళేవారు కారు. ఇలా రోజులు గడిచిపోతున్నాయి.

ఒకసారి ఒక తెలివైన రైతు ఆలోచించాడు. పులి గడ్డి మేస్తుందా? అని అతనికి అనుమానం వచ్చింది. పులి మాంసాహారి అది గడ్డి, గాదం తినదు. మరి ప్రతిరోజు చేలల్లో పడి మేస్తున్నదెవరు? ఇందులో యేదో మోసం వుందని అతను భావించాడు. సంగతి తేల్చాలని ఒకనాడు బాణం, అమ్ము తీసుకొని పైన బూడిద

రంగు శాలువా కప్పుకొని ఒక చెట్టు ప్రక్కన దాక్కున్నాడు.

చీకటపడింది పులితోలు కప్పుకున్న గాడిద అలవాటు ప్రకారం వచ్చింది. చేలోకి దిగబోయి. చెట్టు వైపు చూసింది. బూడిదరంగు శాలువా కనిపించింది. చీకటిలో దానికి అదేమిటో సరిగా తెలియలేదు. బూడిదరంగులో వుందికదా తోటి



పులితోలు కప్పుకున్న గాడిదను బాణముతో కొట్టి చంపుతున్న రైతు

గాడిదే అయివుంటుందని అది వోండ్ర పెట్టింది. తనతో రమ్మని సంజ్ఞ అన్నమాట అది.

అయితే బూడిదరంగు శాలువా కప్పుకొన్న రైతు గాడిద వోండ్ర విని "ఔరా! ఇంతకాలం ఈ పులితోలు కప్పుకొని ఈ గాడిద ఎంత మోసం చేసింది. ఇంక దీనిని నిర్లక్ష్యం చేయకూడదు, దయతలచకూడదు-"

అని వెంటనే బాణం ఎక్కుపెట్టి వదిలాడు. బాణం దెబ్బకు గాడిద నేలకూలి చచ్చిపోయింది. 'తోలు మారితే గొంతు మారదు' అని బోధించే సింహం కథ ఇది. దీనిని కూడా హంసరాజు హిరణ్యకుడు దీర్ఘముఖుడికి చెప్పాడు.

## రంగు చెరిగిపోతే

రంగు చెరిగిపోతే బండారం బయటపడుతుంది. అలాగే సొంతవారిని కాదని నిర్లక్ష్యంచేసి, పైవారిని ప్రోత్సహిస్తే ప్రాణాంతకమే అవుతుంది. పులిచర్మం కప్పుకొన్న గాడిద కథవంటిదే ఈ కథాను. దీనిని సర్వజ్ఞుడు తన రాజైన మేఘ



చాకలివాళ్ళ నీలిమందు బానలో పడిన నక్క

వర్ణునికి చెప్పాడు. నీలవర్ణుణ్ని కొలువులో చేర్చుకుంటానని [illegible] అన్నప్పుడు, సర్వజ్ఞుడు ఈ కథ చెప్పాడు.

నీలిరంగు నక్క మాటలను మిగిలిన నక్కలన్నీ నమ్మాయి. [illegible] అడవిరాజు పదవి వస్తుందని సంతోషించాయి. వెంటనే ఆ నీలిరంగు నక్కను రాజుగా ప్రకటించి దండోరా వేయించాయి.



రాజుగా నమ్మిన ఇతర జంతువులు

సింహం, పులి, ఏనుగు, ఎలుగు ఒకటేమిటి అన్ని జంతువులూ [illegible] నక్కకు జేజేలు పలికాయి. రాజుగా గౌరవించాయి. సన్మానాలు చేశాయి. [illegible] ఇచ్చాయి. బిరుదులు తగిలించాయి.

దీనితో నక్క గర్వం పెరిగింది. తానే చక్రవర్తిని అనుకొంది. [illegible] పదవీ వైభవం, అధికారభోగం తన తెలివివల్లనే వచ్చాయి అనుకొన్నది. [illegible] తనకు పట్టాభిషేకం చేస్తారన్న సంగతినే అది మరచిపోయింది.

రాజ్యంలో అన్నిరకాల పదవుల్ని ఇతర జంతువులకు ఇచ్చింది! సింహాన్ని మంత్రిని చేసుకొంది. పులిని సేనాధిపతిని జేసింది. ఏనుగుకు ప్రధాన న్యాయమూర్తి పదవినిచ్చింది. ఎలుగుకు ఆహారశాఖామంత్రి పదవి ఇచ్చింది.



తోటి నక్కలతో కొట్లాటెట్టుకున్న నక్క-చంపుతున్న సింహము

కోతికి సాంస్కృతికశాఖ ఇచ్చింది. ఇలా అన్ని పదవులు పై జంతువులకే ఇచ్చింది. తన జాతివారైన నక్కల్ని అసలు తలవనేలేదు.

దీనితో వాటికికోపంవచ్చింది పొగరెక్కి-అధికారంలోకన్నుమిన్ను కానకుండా ఉన్న ఆ నక్కకు బుద్ధిచెప్పాలని అవి తీర్మనించాయి. ఒకఉపాయం ఆలోచించాయి.

ఆ ప్రకారం ఒకనాటి సాయంత్రం నక్కలన్నీ ఒకచోటచేరి బిగ్గరగా "వూళ" వేయసాగాయి. అది ఆనందంగా వేస్తున్న "ఊళ" స్వజాతివైన నక్కలు చేస్తున్న సంగీతం కచ్చేరీ విని నీలి రంగు నక్కకుకూడా బిగ్గరగా వూళ వేసింది. ఆనందంగా ఊళ వేసింది. ఒళ్ళు మరచిపోయి ఊళ వేసింది.

ఆ ఊళ విని సింహము దానిమీదపడి చంపింది. ఇంతకాలం అదేదో గొప్ప జంతువని, వనదేవత వరప్రసాదం అని నమ్మి కొలిచి తాము మోసపోయామని ఆ జంతువులన్నీ భావించాయి. అందుకే నక్కను చంపింది.

ఈ కథలో రెండు నీతులున్నాయి. 1. రంగు వెలిసిపోతే మన బండారం బయట పడుతుంది. 2 స్వజాతివారిని నిర్లక్ష్యంచేస్తే ప్రాణాలకే ముప్పు వస్తుంది.

సర్వజ్ఞుడు ఈ కథ చెప్పి హిరణ్యగర్భునితో నీలవర్ణుణ్ని చేరదీయ వద్దని హెచ్చరించాడు.

# గడుసు పులి

గడుసువారు మిత్రద్రోహానికి కూడా వెనుదీయరు. వారికి వారి స్వార్థమే ముఖ్యం. స్వలాభం కోసం వారేమైనా చేస్తారు. చివరకు ప్రాణాలనైనా తీస్తారు. దుష్టత్వంతో గడుసుదనం తోడైతే ఇక వారి ఆగడాలకు అంతే వుండదు. అందు చేత అటువంటి వారికి దూరంగా వుండాలి. ఈ నీతిని వివరించే కథలు దీర్ఘముకుడికి జంబూద్వీపంలో హిరణ్యముకుడు చెప్పాడు.

జంబూద్వీపంలో కామన్యకం అనే ఒక అడవి వుండేది. అక్కడ ఒక కొండ గుహలో పులి నివసిస్తుండేది. దానికి సమీపంలో జువ్వి చెట్టుపై కొంగ వుంటుండేది. ఆ రెండింటికీ పెద్ద స్నేహం లేదు. పరిచయం వుంది. అప్పుడప్పుడు కష్టం సుఖం మాట్లాడుకొంటుండేవి.

ఒకనాడు పులి వొక పొట్టేలును వేటాడి, ఆ మాంసాన్ని చవులూర తింటోంది. హఠాత్తుగా ఒక ఎముక దాని గొంతులో గుచ్చుకుంది. ఎంత ప్రయత్నించినా అది వూడిరాలేదు. పులి మెడను బలంగా విదిలించింది. లోపలకు బాగా గాలి పీల్చి వత్తించింది. ఫలితం లేకపోయింది. అలా బాధపడుతూ కూర్చుంది

దండకారణ్యంలో పూర్వం ఒక మరిచెట్టు ఉండేది. దానిపై యెన్నో కాకులు నివసిస్తున్నాయి. మేఘవర్ణుడు అనే బలమైన కాకి వాటికి రాజు. ఆ చెట్టుకు దగ్గరలోనే ఒక కొండ గుహ వుంది. ఆ గుహలో చాలా గుడ్లగూబలుండేవి. ఉపమర్ధనుడు అనే గుడ్లగూబ వాటికి రాజు.



కాకులను చంపుతున్న గుడ్లగూబలు

కాకులకు, గుడ్లగూబలకు ఎప్పుడు విరోధమే! అవి వాదులాడుకొనని, కీచులాడుకొనని రోజేలేదు. ఇలా వాటిమధ్య శత్రుత్వం బాగా పెరిగింది. ఒకనాటి రాత్రి ఉపమర్ధనుడు తన సైనికులను పిలిచి ఇలా ఆజ్ఞాపించాడు.

"సైనికులారా! శత్రుశేషం, అగ్నిశేషం, ఋణశేషం ఉంచరాదు. ఒక్క శత్రువు మిగిలినా అతడు కాలక్రమంలో బలం పుంజుకొని దెబ్బతీస్తాడు. అలాగే నిప్పుకణం చిన్నదే అయినా గాలి సహవాసం చేసి జ్వాలలు రేపుతుంది. ఋణం

కొంచెమే కదా అని అశ్రద్ధచేస్తే వడ్డీ పెరిగి పెరిగి తలకు మించిన భారం అవుతుంది. కనుక ఈ మూడింటి శేషం ఉంచరాదు. మీరు ఇప్పుడే పోయి మర్రి చెట్టుపై దాడిచేసి ఆ కాకి మూకల్ని చంపివేయండి వెళ్ళండి"

రాజావారి ఆజ్ఞవిని గుడ్లగూబలు రివ్వున ధ్వనిచేస్తూ మర్రి చెట్టు వైపు ఎగిరిపోయాయి.

రాత్రి నిద్రలోవున్న కాకులు హఠాత్తుగా జరిగిన ఈ దాడికి తట్టుకొన లేకపోయాయి. గుడ్లగూబలు ఆ కాకుల్ని చీల్చిచెండాడాయి. కాని మేఘవర్ణుడు తన మంత్రులతో చాకచక్యంగా తప్పించుకొని ప్రాణాలు కాపాడుకొన్నాడు. ఆ రాత్రి గడిచింది.

మరునాడు ఉదయం మేఘవర్ణుడు చెట్టుదగ్గరకు తిరిగివచ్చాడు. అక్కడ తన బంధువులు, మిత్రులు, స్నేహితులు చచ్చిపడి వుండడం చూసి ఎంతో బాధ పడ్డాడు. ఇంతలో అతని మంత్రులుకూడా వచ్చారు. అందరూ పరస్పరం కుశల ప్రశ్నలు వేసుకున్నారు. యుద్ధంలో మరణించిన వారి గురించి కొంతసేపు విలపించారు. తమను తాము సముదాయించుకొన్నారు. అక్కడ చిరంజీవి అనే మంత్రి రాజుతో ఇలా అంది.

"మహారాజా! మనల్ని మోసగించి, అర్ధరాత్రి దాడిచేసి మనజాతిని నాశనం చేసిన ఆ గుడ్లగూబలపై ప్రతీకారం తీర్చుకోవాలి. అందుకు నేను ఉపాయం ఆలోచించాను. మీరంతా ఇక్కడకు సమీపంలో ఋష్యశృంగ పర్వతం మీదకు వెళ్ళిపోయి తలదాచుకోండి. నేను ఉపమర్ధనుడి కొలువుజేరి సమయం చూసి చిచ్చుపెడతాను"

చిరంజీవి చెప్పిన మాటలువిని కాకులన్నీ "అలాగే" అని ఋష్యశృంగ పర్వతం పైకి ఎగిరిపోయాయి. ఇక్కడ చిరంజీవి చెట్టుక్రింద పడి మూలుగు తున్నట్టు నటించసాగింది.

ఇంతలో అక్కడకు ఉపమర్ధనుడు సైనికులతో వచ్చాడు! చెట్టుక్రింద గుట్టలుగా పడివున్న కాకుల కళేబరాలు చూశాడు. తన సైనికులు చేసిన ఘన కార్యాన్ని మెచ్చుకొన్నాడు.

చిరంజీవి మాటలకు ఉపమర్ధనుడు సంతోషించాడు. అతనికి కలిగిన నష్టానికి నొచ్చుకున్నాడు. చిరంజీవికి వెనుక ముందూ ఆలోచించక తన స్నేహ హస్తం అందించాడు.

చిరంజీవి తన ఎత్తు పారినందుకు లోలోన ఆనందించాడు. పైకి మాత్రం మేఘవర్ణుడిని నిందించి ఉపమర్ధనుణ్ని స్తుతించాడు. గుడ్లగూబలరాజ్యంలో చిరంజీవి



గుడ్లగూబల గుహకు నిప్పుపెట్టుచున్న కాకులు

ఒకడయ్యాడు. అతనికి రాజు అన్నిసదుపాయాలు చేయించాడు.

చిరంజీవి నమ్మకంగా మసలుతూ ఉపమర్ధనుడి కోటైన ఆ కొండ గుహ రహస్యాలు, అనుపానులు అన్నీ తెలుసుకున్నాడు. ఒకరోజు రాత్రి గుడ్లగూబలు అన్నీ అదమరచి నిద్రపోతున్నాయి. రాజుఅంతఃపురంలో గాఢనిద్రలో ఉన్నాడు.

అటుఇటు తిరుగుతున్న ఉపమర్ధనునకు మూలుగు వినిపించింది. అటువైపు వెళ్ళిచూశారు.

అచట కాకి రక్తసిక్తమైన శరీరంతో మూలుగుతుండటం చూసి సంగతిని అడిగాడు. అప్పుడు చిరంజీవి ఆయాసం నటిస్తూ ఇలాఅన్నాడు.



గుడ్లగూబ రాజు వద్దకు తీసుకొని వచ్చిన చిరంజీవి (కాకి)

"నేను కాకులరాజైన మేఘవర్ణుడి మంత్రిని. నా పేరు చిరంజీవి. నేను మా రాజుకు మేలుచేయబోయి శిక్ష అనుభవించాను. గుడ్లగూబల రాజు ఉపమర్ధనుడు బలవంతుడు. పెద్దవాడు. మనం అతని స్నేహం చేద్దామని నేను మా రాజుకు చెప్పాను ఆయన వినలేదు. పైగా మిమ్మల్ని పొగిడానని నన్ను నిందించాడు. హింసించాడు నాకు మీరే దిక్కు."

చిరంజీవి మాటలకు ఉపమర్ధనుడు సంతోషించాడు. అతనికి జరిగిన నష్టానికి నొచ్చుకున్నాడు. చిరంజీవికి వెనుక ముందూ ఆలోచించక తన స్నేహ హస్తం అందించాడు.

చిరంజీవి తన ఎత్తు పారినందుకు లోలోన ఆనందించాడు. పైకి మాత్రం మేఘవర్ణుడిని నిందించి ఉపమర్ధనుణ్ని స్తుతించాడు. గుడ్లగూబలరాజ్యంలో చిరంజీవి



గుడ్లగూబల గుహకు నిప్పుపెట్టుచున్న కాకులు

ఒకరయ్యాడు. అతనికి రాజు అన్నిసదుపాయాలు చేయించాడు.

చిరంజీవి నమ్మకంగా మసలుతూ ఉపమర్ధనుడి కోపైన ఆ కొండ గుహ రహస్యాలు, ఆనుపానులు అన్నీ తెలుసుకున్నాడు. ఒకరోజు రాత్రి గుడ్లగూబలు అన్నీ ఆదమరచి నిద్రపోతున్నాయి. రాజు అంతఃపురంలో గాఢనిద్రలో ఉన్నాడు.

అప్పుడు చిరంజీవి నెమ్మదిగాలేచి బయటకువచ్చాడు. ఆ కొండగుహ ద్వారాన్ని గడ్డితో, చితుకులతో, ఎండుపుల్లలతో కప్పివేశాడు. గబ గబ ఎగిరి రుష్యశృంగ పర్వతం చేరాడు. తనే రాజుగారిని, మిగిలిన వారిని నిద్రలేపాడు. ఎండుపుల్లలు ముక్కునకరుచుకుని రమ్మన్నాడు.

అందరూ అలాగే చేశారు. గుడ్లగూబల కోట కొండగుహ వద్ద కాకులన్నీ ఎండుపుల్లల్ని వేశాయి. చిరంజీవి ఆ పుల్లల్ని, గడ్డిని అంటించాడు. ఆ మంటల వేడికి, ఆ పొగధాటికి వుక్కిరి బిక్కిరై గుహలోని గుడ్లగూబలన్నీ కుతకుతా ఉడికి చచ్చిపోయాయి. చిరంజీవిని కాకులు, వాటిరాజు మేఘవర్ణుడు ఎంతగానో ప్రశంసించారు. అప్పటినుండి ఆ కాకులు సుఖంగా వున్నాయి. శత్రుశేషాన్ని వుంచరాదని శత్రువుకు చెందినవారిని చేరనీయరాదని ఈ కథ నీతి.

# ఆపద దాటాలంటే...

ఆపద దాటాలంటే సమయాన్నిబట్టి శత్రువుతో అయినా స్నేహం చేయాలి. ఆ గండం తీరగానే శత్రువును దూరంగా వుంచాలి. నీలవర్ణునితో స్నేహం మంచిదికాదని సర్వజ్ఞుడు చెప్పినప్పుడు హిరణ్యగర్భుడు చెప్పిన నీతికథ ఇది.

పంచవటి ప్రాంతంలో ఒక మర్రిచెట్టు వుంది. ఆ చెట్టుతొర్రలో రోమాంశుడు అనే పిల్లి అక్కడి కన్నంలో పలితుడు అనే ఎలుక కాపురం వుంటున్నాయి.

ఒకనాటి రాత్రి వేటగాడు ఒకడు చెట్టు క్రింద వలపన్ని వెళ్ళాడు. తెల్లవారగానే వేటకై చెట్టుదిగిన పిల్లి ఆ వల సంగతి తెలియక అటువచ్చి వలలో చిక్కుకొని పోయింది. తప్పించుకునే మార్గం కనిపించలేదు.

ఇంతలో కన్నంలోంచి ఎలుక బయటకు వచ్చింది. తన శత్రువైన పిల్లి వలలో చిక్కుకొనిపోయి భయపడుతుండడం చూసి అది ఎంతో సంతోషించింది. అప్పుడు పిల్లి ఇలా అంది.

"ఓ చిట్టెలుకా! ఈ వలను నీ పదునైన పళ్ళతో కొరికి నన్ను రక్షించు"

పిల్లి మాటలు విని ఎలుక నవ్వింది. "సహజ శత్రువైన నిన్ను రక్షిం
చను" అని ఎలుక అక్కడే పిల్లిని ఏడిపిస్తూ గంతులు వేయసాగింది. ఇంతలో
అక్కడకు గుడ్లగూబ వచ్చింది. ఎలుకను వేటాడాలని దాని ఆశ. ఆ సంగతి కని
పెట్టిన ఎలుక వల దగ్గరకు వచ్చి కొరుకుతున్నట్లు నటించసాగింది.
ఎంతసేపటికి ఎలుక వలకు దూరంగా రాకపోవడంతో గుడ్లగూబ విసిగి



వలలో చిక్కుకున్న పిల్లి, చూస్తున్న ఎలుక

ఎగిరిపోయింది. గండం గడిచిందని ఎలుక మరల గంతులు వేయసాగింది. అప్పుడు
పిల్లి ఇలా అన్నది.

"ఓ మూషికమా ! ఇంతసేపు వలనేల కొరకలేదు ? కొరుకుతున్నట్లు
నటించావు?"

వేటగాడు అచటకు వచ్చి వల ముక్కలై వుండడం, వేటజంతువు పారిపోవడం చూచి దిగాలుపడి వెళ్ళిపోయాడు. అప్పుడు పిల్లి తొర్ర బయటకు వచ్చి ఎలుకతో ఇలా అంది :

"ఓ మిత్రమా! మా ఇంటికి విందుకురా, నువ్వు చేసిన ఉపకారానికి బదులు నీకు మంచి భోజనం పెడతాను."

పిల్లి మాటలకు ఎలుక నవ్వి ఇలా అంది :

"ఓ మార్జాలమా! గుడ్లగూబ నుంచి రక్షించుకొనడానికై కొంతసేపు నీతో స్నేహం చేశాను. దాని బారినుండి రక్షించుకొనడానికై నిన్ను ఉపయోగించుకొన్నందుకు కృతజ్ఞతగా నీకు ప్రాణదానం చేశాను. మన ఇద్దరి కష్టాలు గడిచాయి. ఆకలితో వున్న నువ్వు చేసే విందు నాకు కాదు.నన్నే విందారగిస్తావు నువ్వు. కనుక నేను రాను. వస్తా."

ఈ మాటలు చెప్పి ఎలుక కన్నంలో దూరిపోయింది. పిల్లి ఎలుక తెలివికి ఆశ్చర్యపోయింది. తన ఎత్తు పారలేదని బాధపడింది.

"అవసరం ఉన్నంతవరకూ, ఆపద తీరేవరకూ శత్రువునయినా తాత్కాలికంగా స్నేహం చేయాలి తప్ప దానిని పూర్తిగా నమ్మరాదు" అని ఈ కథ హెచ్చరిస్తుంది.

[హిరణ్యగర్భ చిత్రవర్ణుల రాజ్యాలు వాటిమధ్య యుద్ధం సందర్భాను సారంగా కొన్ని నీతికథల వివరణతో 'విగ్రహం' పూర్తి అయింది.]




సంధి అనగా స్నేహం, కలియడం అని అర్థాలున్నాయి. రెండు వస్తువుల్ని కలపడం అనికూడా అంటారు. అయితే రాజనీతిలో సంధి అంటే యుద్ధం జరగకుండాగాని, యుద్ధం జరిగాక కాని ఇరువర్గముల మధ్య కుదిరే "రాజీ" లేదా "స్నేహం" అని అర్థం.

హిరణ్యగర్భుడు, చిత్రవర్ణుడు యుద్ధం జరిగిన తరువాత కొంతకాలానికి సంధి కుదుర్చుకొన్నారు. అందుకే దీనిని సంధి అని పేరు పెట్టారు. ఆ కథ దీనిలోని ప్రధానాంశం. ఇతర ప్రకరణాలలో వలెనే దీనిలోనూ సందర్భానుసారంగా నీతికథలు వస్తాయి. ముందు ప్రధానకథ చెప్పుకొని ఆ తర్వాత ఆయా నీతికథల్ని చదువుకొందాం.

యుద్ధ సమయంలో తన బలగమంతా నాశనం కావడంతో హిరణ్యగర్భుడు చిత్రవర్ణుని నుండి రక్షణకై సరస్సులో మునిగి దాగొన్నాడు. మంత్రి చిత్రవర్ణుడు స్వరాజ్యానికి వెళ్ళిపోయాడు. కొంతసేపైనాక హిరణ్యగర్భుడు పైకి తేలివచ్చాడు.

యుద్ధంలో సర్వజ్ఞుడు,మరికొన్ని జలపక్షులుకూడా బ్రతికి బయటపడ్డాయి. అవికూడా రాజుదగ్గరకు వచ్చాయి. పరస్పరం కుశలప్రశ్నలు వేసుకొన్నాయి. బ్రతికినందుకు ఒకదాని నొకటి అభినందించుకొన్నాయి. యుద్ధంలో వీరోచితంగా పోరాడి, ప్రాణాలర్పించిన పక్షియోధులకు శ్రద్ధాంజలి ఘటించాయి.

క్రమంగా వాటికి యుద్ధభీతి ఓటమివల్ల కలిగిన వేదన పోయాయి. ఉపశాంతి లభించినది. అవన్నీ శాంతపడినాయి. ఒకనాడు హిరణ్యగర్భుడు తామర

పువ్వుపై కూర్చున్నాడు. మంత్రి సర్వజ్ఞుడు ఇతరములయిన జలపక్షులు రాజును పరివేష్టించి ఉన్నాయి.

అప్పుడు హిరణ్యగర్భుడు తన హితైషులతో ఇలా అన్నాడు :

"ప్రియమిత్రులారా! మంత్రి పుంగవులలారా! మన బల పరాక్రమాలలో



దీర్ఘముఖుని క్షేమములు అడుగుచున్న హిరణ్యగర్భుడు

చిత్రవర్ణుని కన్న తక్కువవారం కాము, కాని మనం యెందుకు వోడిపోయాం ? మన కోటకు నిప్పుపెట్టిన వారెవరు? మనలోనే వుండి ఈ ద్రోహానికి పాల్పడిన వారెవరు? '

రాజు ప్రశ్నలు విని సర్వజ్ఞుడు ఇలా అన్నాడు :

"ప్రభూ! మీరు నా మాట వినక చేరదీసిన నీలవర్ణుడే ఈ పని చేశాడని నా నమ్మకం. మనం యుద్ధ ప్రయత్నాలు పూర్తి చేసుకొంటుండగా అతడు మాయమయ్యాడు. మరల అతగాడి జాడలేదు."

అందరు సర్వజ్ఞుని మాటలను బలపరిచారు. హిరణ్యగర్భుడు మౌనం వహించాడు. ఇంతలో ధవళాంగుడు అనే వేగువచ్చాడు. అతడికి యుద్ధం ముగిశాక కొన్ని రోజులకు జంబూద్వీపము పంపారు. అక్కడ చిత్రవర్ణుడు చేయదలచిన పనులు గురించి రహస్య సమాచారం తీసుకొని రమ్మని అతన్ని పంపారు. అచటి రహస్యాలు తెలుసుకొని వచ్చాడు. రాజుగారికి, మంత్రికి నమస్కరించి ధవళాంగుడు ఇలా అన్నాడు :

"మహారాజా! యుద్ధ సమయంలో మన రహస్యాలు తెలుసుకొని చిత్రవర్ణునికి తెలియజేసినవాడు నీలవర్ణుడే, అతని అసలు పేరు మేఘవర్ణుడు. మన కోటకు నిప్పు పెట్టినవాడు కూడా అతడే ఆ సంగతులు అట్లుండనిండు. గత జల సేతు బంధనవల్ల ప్రయోజనం లేదుకద."

ధవళాంగుని మాటలు విని హిరణ్యగర్భుడు ఇలా అడిగాడు :

"అది సరే, ఇప్పుడు చిత్రవర్ణుడు ఏమిచేయదలచాడు? అక్కడ సంగతు లేమిటి?"

అనగా విని ధవళాంగుడు ఇలా అన్నాడు : "మహారాజా ! కర్పూర ద్వీపాన్ని జయించిన చిత్రవర్ణుడు ఇప్పుడు మన ద్వీపానికి మేఘవర్ణుని రాజుగా చేయాలనుకుంటున్నాడు. మేఘవర్ణుని వలనే తమకు కర్పూరద్వీపం సులభముగా స్వాధీనమైందని అందుకే కృతజ్ఞతగా అతనిని కర్పూర రాజ్యాధిపతిని చేయాలని చిత్రవర్ణుడు భావించాడు. ఇక మనము బానిసత్వం చేయవలసిందే! పరాయి పాలన తప్పదు.

# రాయబారం

కర్పూరద్వీపంలో హిరణ్యగర్భుడు తన మంత్రులతో యుద్ధపరాజయం గురించి బేరీజు వేసుకుంటున్న సమయంలోనే అక్కడ జంబూద్వీపంలో చిత్రవర్ణుడు కొలువుదీరాడు. ప్రక్కన మంత్రి అయిన దూరదర్శి ఉన్నాడు. కొంతదూరాన మేఘవర్ణుడు ఉన్నాడు. అప్పుడు చిత్రవర్ణుడిలా అన్నాడు.



చిత్రవర్ణునితో మాట్లాడుచున్న మేఘవర్ణుడు

"మహామంత్రీ! హిరణ్యగర్భుడు మహాపరాక్రమవంతుడు గద, అతడి సైన్యంకూడా తక్కువదేమీ కాదు. కాని యుద్ధంలో మనం జయించాం."

రాజుగారి ప్రశ్నకు దూరదర్శి ఇలా సమాధానం చెప్పాడు.

"మహారాజా! మనము పరాక్రమము ప్రదర్శించి జయించలేదు.

ఉపాయంలో అదీ కుటిలోపాయంతో వారి కోటను వశపరచుకున్నాం. అది తప్పు. అందుచేత కర్పూరద్వీపానికి మేఘవర్ణుణ్ని రాజును చేసే యోచన మానుకోండి. ఉత్తముడయిన హిరణ్యగర్భునితో సంధి చేసుకోండి."

మంత్రి మాటలు విన్న చిత్రవర్ణుడు తలపంకించి మేఘవర్ణునితో ఇలా అన్నాడు :

"మేఘవర్ణా నువ్వు హిరణ్యగర్భుని ఆస్థానంలో వుండివచ్చావు గదా అతని గుణగణాలేమిటి? అతనితో స్నేహం మంచిదేనా?"

చిత్రవర్ణుని ప్రశ్నకు మేఘవర్ణుడు ఇలా సమాధానం చెప్పాడు.

"మహాప్రభూ! హిరణ్యగర్భుడు ఉదాత్తచరితుడు. బలవంతుడు, పరాక్రమశాలి, సచ్ఛీలుడు, వినయవంతుడు, మాటతప్పని ధీరుడు. విశేషించి దయార్ద్రహృదయుడు, ఆయన మంత్రి సర్వజ్ఞుడు. మహాపండితుడు, యుక్తాయుక్త వివేచనాశీలుడు. తొందరపాటు లేని మేధావి."

మేఘవర్ణుని మాటలు విని చిత్రవర్ణుడు "అంత తెలివైనవాడు నీ మోసపు మాటలు యెలా నమ్మాడు?" అని ప్రశ్నించాడు.

అందుకు మేఘవర్ణుడు చిరునవ్వు నవ్వి "ప్రభూ! ప్రమాదో ధీమతామపి అని పెద్దల వచనం. ఎంతటివారైనా పొరపాటు చేయక మానరు. తప్పుఅంచనాలు వేయకపోరు. నా విషయంలో అదే జరిగింది." అని చెప్పాడు. అప్పుడు దూరదర్శి ఇలా అన్నాడు :

"ప్రభూ! జరిగిపోయినదాన్ని గురించి విచారించి లాభంలేదు. జరగవలసినదాన్ని గురించి ఆలోచించండి! నా అభిప్రాయం ప్రకారం హిరణ్యగర్భునితో మీరు సంధిచేసుకోవడం మంచిది. అటువంటి ఉత్తములతో స్నేహం అన్ని విధాల శ్రేయస్కరం"

మంత్రి మాటలు విని చిత్రవర్ణుడు "ఆ కార్యభారం నువ్వే వహించు, రాయబారిగా వెళ్ళి హిరణ్యగర్భునితో మాట్లాడి ఉభయుల మధ్య రాజీ కుదుర్చు, ఉభయరాజ్య క్షేమాన్ని ఆశించి సంధి చెయ్యి—"అని ఆజ్ఞాపించాడు.

దూరదర్శి మాటలు విని హిరణ్యగర్భుడు యెంతో ఆనందించాడు.

"యుద్ధంలో వోడిపోయిన మేము రాయబారానికీ, మరల యుద్ధానికీ తడపడవలసినవారం. కాని మీ రాజు విజ్ఞతతో ఎటువంటి వైపరీత్యము జరగరాదని ముందే మిమ్ము రాయబారిగా పంపటము యెంతో ఆనందింపదగింది. వారితో స్నేహం మాకు ఇష్టమే. మా సర్వజ్ఞులవారి అభిమతము కూడా అదే" అని హిరణ్యగర్భుడు అన్నాడు.

ఆపై దూరదర్శి ఇలా అన్నాడు- "మహారాజా! సంధులు పదహారు రకాలున్నాయి. కాని వాటిలో ముఖ్యమైనవి నాలుగురకాలు. అవి : 1. పరస్పర సహకారము 2. స్నేహము 3. వినయము 4. బహుమానము. వీటిలో ప్రస్తుతం మన రెండు రాజ్యాలమధ్య బహుమాన పూర్వకమయిన సంధి జరగాలి. అదే కాంచన సంధి. అంటే బంగారము ఇచ్చి సత్కరించడము."

దూరదర్శి మాటలు విని హిరణ్యగర్భుడు భటులచే బంగారు ఆభరణాలు తెప్పించాడు. దూరదర్శిని సత్కరించాడు. అభిమానించారు, విందు వినోదాలు చేయించారు! చిత్రవర్ణునికి కానుకలు పంచారు. ఆ తర్వాత దూరదర్శి సూచన మేరకు సర్వజ్ఞుడు జంబూద్వీపము వెళ్ళాడు.

అక్కడ చిత్రవర్ణ మహారాజు సర్వజ్ఞమంత్రికి సకలవిధాల రాజమర్యాదలతో సన్మానించాడు. హిరణ్యగర్భునికి ఇవ్వవలసినదని బంగారు పళ్ళెంలో ముత్యాలు, రత్నాలు కానుకలు పంపాడు.

ఆ తర్వాత ఒకనాడు పరివారంతో చిత్రవర్ణుడు కర్పూరద్వీపంవచ్చాడు. హిరణ్యగర్భుడు తన జలపక్షి పరివారం యెదురేగి స్వాగతం చెప్పాడు. వీరిరువురి మధ్య 'కాంచనసంధి' కుదిరిందని తెలియని సింహళరాజు మహాబలుడు, తన సైన్యంతో అదే సమయానికి కర్పూరద్వీపము వచ్చాడు.

# పాము బుద్ధి

పాముకు పాలుపోసి పెంచినా. అది విషాన్నే కక్కుతుంది. అది పాము బుద్ధి. దానికి మంచితనం కృతజ్ఞత అనే భావాలే ఉండవు. ఈ నీతిని చెప్పే కథను దూరదర్శికి చెప్పాడు. మేఘవర్ణుణ్ని కర్పూర ద్వీపానికి మహారాజును చేస్తానని నెమిలిరాజు అన్నప్పుడు కుటిలబుద్ధి అయిన ఆ కాకికి రాజ్యాధికారం ఇవ్వవద్దని



మంటలలో కాలిపోవుచున్న పాము

దూరదర్శి హెచ్చరించాడు. కుటిలుడు పామువంటి వారని చెప్పాడు. పాము స్వభావం గురించి ఈ నీతి కథ వివరించాడు.

హిమాలయ పర్వత ప్రాంతం అది. అక్కడ ఒక అడవిలో పాము ని[illegible] అది [illegible] నిస్తోంది. ఒకసారి ఆ అడవిలో ఒకచోట నిప్పు అంటుకొంది.

ఎక్కువగా ఉన్నచోట కావడంవలన మంటలు త్వరత్వరగా వ్యాపించాయి. పాము ఎటూ తప్పించుకోలేకపోయింది. ప్రాణభయంతో విలపిస్తూ ఉంది. ఇంతలో అటు వైపుగా బ్రాహ్మణుడు ఒకడు వచ్చాడు, అతణ్ణి చూసి పాము ఇలా అంది.

ఓ బ్రాహ్మణోత్తమా నువ్వు నా ప్రాణాలు కాపాడ పుణ్యంకట్టుకో. నా పాలిటి దేవుడివి నువ్వు. పైకి వచ్చాక నిన్ను నేను ఏమీ చేయను,"



పామును రక్షించుచున్న బ్రాహ్మణుడు

పాము ప్రార్థన, దీనాలాపన విని బ్రాహ్మణుడి మనసు కరిగింది. ఆప దలో వున్నవారిని కాపాడటం తన విధి అని తలచాడు. వెంటనే తన చేతి సంచి కర్రకు తగిలించి మంటలమధ్య దూర్చి పాము దగ్గరగా పట్టుకొన్నాడు. పాము

చరచరా ఆ సంచిలోకి దూరింది. బ్రాహ్మణుడు ఆ సంచిని తీసుకొని దూరంగా వెళ్ళి అక్కడ పామును విడిచిపెట్టాడు.

ఆపద గడిచి బయటపడగానే పాము పడగ విప్పింది. బ్రాహ్మణుడు భయపడ్డాడు. "ఓయీ పామూ! ఎంత కృతఘ్నురాలివి నువ్వు. నీకు ఉపకారంచేసిన నన్ను కాటు వేయాలనుకొంటున్నావా? నీకు నేను చిక్కనులే" అని బ్రాహ్మణుడు వేగంగా పరుగెత్తసాగాడు.

అప్పుడు పాము "ఓయీ బ్రాహ్మణుడా! మీ మనుషులు మాత్రంతక్కువ వారేమిటి? మేము కనిపిస్తే చాలు కర్రలతో, బరెనలతో కొట్టి చంపుతారు. అందుకే నిన్ను విడిచిపెట్టను" అంటూ అతడిని వెంబడించింది.

బ్రాహ్మణుడు పరుగు పెడుతున్నాడు. పాము "చరచర" పాకి అతడిని వెంబడిస్తోంది.

ఇంతలో వారికి ఒక నక్క ఎదురుపడింది. ఇద్దరూ ఆగిపోయారు సంగతేమిటని అడిగింది. బ్రాహ్మణుడు జరిగిన సంగతి చెప్పాడు. నక్క అంతా విని కొంతసేపు ఆలోచించింది. "ఈ పాము పాపం వెర్రిబ్రాహ్మణున్ని చంపాలనుకొంటోంది. దీనికి తగిన శాస్తి చేయాలి" అని నక్క ఒక ఆలోచన చేసి యిలా అంది :

"మీరు చెప్పింది నాకేమీ అర్థంకాలేదు. ఏం జరిగిందో చేసి చూపండి."

నక్క ఆ మాటనగానే బ్రాహ్మణుడు కర్రకు పంచి తగిలించి క్రింద పెట్టాడు. పాము దానిలోకి దూరింది. బ్రాహ్మణుడు ఆ సంచిని, కర్రను పట్టుకొని మంటల దగ్గరకు వెళ్ళాడు. నక్క అనుసరించింది.

అక్కడ బ్రాహ్మణుడు కర్రను మంటలలోనికి పోనిచ్చి క్రిందఆన్చాడు. పాము "చరచర" పాకి క్రిందకు వచ్చింది. బ్రాహ్మణుడు సంచి కర్రచే బయటకు తీసివేశాడు.

మంటలు చుట్టుముడుతున్నాయి. వేడికి పాము విలవిలలాడుతోంది' బ్రాహ్మణుడు మరల దానిని బయటకు తీయబోయాడు. అప్పుడు నక్క యిలా అంది :

"వెర్రి బాపనయ్యా! ఆ పాము నిన్ను కరవబోయింది. మళ్ళీ బయటకు



నక్కకు వివరించుచున్న బ్రాహ్మణుడు

తీసే ప్రయత్నం ఎందుకుచేస్తావు? దానికి శాస్తిచేయడానికే ఈ ఎత్తు వేశాను. పద! పద! ఇంటికి వెళ్ళు."

నక్క మాటలు విని బ్రాహ్మణుడు ఇంటికి వెళ్ళిపోయాడు. నక్క తన దారిన తాను వెళ్ళిపోయింది, పాము మంటలలో పడి కాలిపోయింది.

అందుచేత దుష్టులతో చెలిమి, వారికి అధికారం ఇవ్వడం మంచిది కాదని ఈ కథ హెచ్చరిస్తుంది.

## పిల్లికి అధికారం

పిల్లికి అధికారం ఇస్తే, అది ప్రాణాలు తీస్తుంది. అంటే అల్పుడు



పక్షి తొర్రలో జొరబడిన కుందేలు.

నీచుడు అయినవారికి అధికారం ఇస్తే ముప్పు వస్తుందని హెచ్చరించే ఈ కథను కూడా దూరదర్శి తన రాజైన చిత్రవర్ణునికి చెప్పాడు.

ఒక పెద్ద చెట్టు తొర్రలో "కపింజలం" అనే పక్షి నివసిస్తుండేది. ఒక నాడది ఆహారం సంపాదన చేసుకొని తిరిగి వచ్చేసరికి, ఆ తొర్రలో దీర్ఘకర్ణుడు

అనే కుందేలు వుంది. ఎంత సేపటికి అది కదలలేదు. పైగా సొంత ఇంటిలోవలె పడుకొంది. అప్పుడు కపింజలం ఇలా అంది :

"దీర్ఘకర్ణా! ఇది నా ఇల్లు. నువ్వు ఆక్రమించావేం? లే! వెళ్ళు."

కపింజలం మాటలు విని కుందేలు ఇలా అంది :

"ఓయీ కపింజలమా! చెట్టుతొర్రలు, నీటి చెరువులు ముందుగా ఎవరు స్వాధీనం చేసుకొంటే వారివే అవుతాయి. వీటిపై ఎవరికి శాశ్వత అధికారంలేదు."

కుందేలు మాటలకు కపింజలం ఎంతో బాధపడింది. వాదులాడింది. చాలా కాలంనుంచి ఆ తొర్రలో తాను ఉంటున్నానని ఋజువు—సాక్ష్యాలు ఏకరువు పెట్టింది. అయినా దీర్ఘకర్ణుడు వినలేదు. చివరకు కుందేలు ఇలా అంది.

"నా మాట నమ్మకం లేకపోతే ఇక్కడకు సమీపంలో ధధీకర్ణుడు అనే పిల్లి ఉంది. అది గొప్ప విద్వాంసురాలు. దానికి ఫిర్యాదు చేద్దాం. అది తీర్పు ఎలా చెబితే అలా చేద్దాం."

కుందేలు మాటలు విని కపింజలం "అయ్యయ్యో! మణి ధరించినపామును ఎవరైనా చేరదీస్తారా? పండితుడైనా సరే నీచ జాతివాడి దరి చేరరాదు. ఆ పిల్లి నీచ కులానికి చెందినది. పైగా మాంసాహారి. దానిని నమ్మరాదు" అంది అందుకు కుందేలు పకపక నవ్వింది. చెవులు అటు ఇటు ఆడించి కపింజలాన్ని వేళాకోళం చేసి ఇలా అంది-

"నీకు ఈ తొర్ర కావాలంటే పిల్లి తీర్పు కోరదాం. లేకంటే నీ దారిన నువ్వు పో."

విధిలేక కపింజలం కుందేలు షరతుకు ఒప్పుకుంది. ఇద్దరూ కలిసి నెమ్మదిగా పిల్లి దగ్గరకు వెళ్ళారు. నమస్కరించారు. సంగతి చెప్పారు. ఆ పిల్లి పేరు ధధీకర్ణుడు. అంటే దాని చెవులు పెరుగువలె తెల్లగా వుంటాయని అర్థం.

పిల్లి కపింజలం మాటల్ని, ధధీకర్ణుడి వాదాన్ని వింది తల పంకించింది. నాలుకతో మీసాలు సవరించుకొంది. గుడ్లు అటు ఇటు తిప్పింది. క్షణకాలం ఆలో చిస్తున్నట్లు కళ్ళుమూసుకుని తెరిచి, ఆ రెండింటిని చూసి ఇలా అంది.

"చిరంజీవులారా! వయసుచే, అనుభవంచే పండిపోయిన వాడను. నా



పిల్లికి చెప్పుచున్న పక్షి, కుందేలు

మాటలు వినండి. దగ్గరగా రండి. నేను మిమ్ము ముట్టను మాంసాహారం మాని వేశాను. శాఖాహారినై ముని వృత్తిని అవలంభిస్తున్నాను."

ధధీకర్ణుడు మాటలు విని నమ్మి కపింజలం. దీర్ఘకర్ణుడు దాని దగ్గరగా వచ్చాయి, అప్పుడు పిల్లి మరల ఇలా చెప్పింది :

"వత్సలారా! ఈ శరీరం శాశ్వతమైంది కాదు. ఏదో ఒకనాడు నశించి పోయి బూడిద అయిపోతుంది. అందుచేత ఈ గూడు శాశ్వతం అని భావించడం మూర్ఖత్వం, చివరకు మనతో వచ్చేది మంచి మాత్రమే. అందుకే బతికివున్నప్పుడే పరోపకారం చేయాలి, ధర్మచింతనతో మెలగాలి."

పిల్లి అరమోడ్పు కళ్ళతో చెపుతున్న వేదాంత విషయాలను కపింజలం, దీర్ఘకర్ణుడు వినసాగారు.



దీర్ఘకర్ణుని, దధీకర్ణుడు ఎతుకొని పోవుట

వారు తన మాటలనే వింటూ పరిసరాలను మరచిపోతున్నారని పిల్లి పసి కట్టింది. వారిని యింకా తన మాటల మైకంతో ముంచాలని ఇలా అంది :

"వెన్నెముక నిచ్చి దధీచి, మాంసాన్ని కోసి పంచిపెట్టి శిబి, మంచినీళ్ళు యిచ్చి రతిదేవుడు దానశీలురయ్యారు. కీర్తిపంతులయ్యారు. కవచ కుండ

లాటు ఇచ్చి కర్ణుడు యశఃకాయుడయ్యాడు. అందుచేత దానంద్వారానే ఏ జీవి అయినా జన్మను ధన్యం చేసుకోవాలి."

పిల్లి మాటలతో కపింజలం, దీర్ఘకర్ణుడు మైమరిచారు. అలా మాటలను చెపుతూ, చెపుతూ ధధీకర్ణుడు అవి ఏమరుపాటుగా ఉన్నాయని రూఢి చేసుకొని హఠాత్తుగా రెండింటిని ఒడుపుగా పట్టుకుని చంపి తినేసింది. అందుచేత అల్పునకు, నీచునకు అధికారం ఇవ్వరాదు.

## పేలపిండి

"పేరాశ పేలపిండిలా ఎగిరిపోతుంది. అసలు ఆశే పనికిరాదు. పైగా దుష్టస్వభావం గలవాడికి అధికారం ఇచ్చి ఆపై వాడినుంచి ఏదో లాభం ఉంటుం దని ఆశించటం అసలే పనికిరాదు" మేఘవర్ణుకి కర్పూరద్వీపాన్ని అప్పగిస్తానని అప్పుడు అతడు ఏదో తనకు లాభం చేకూరుస్తాడని చెప్పిన చిత్రవర్ణునితో దూర దర్శి ఈ మాటలు చెప్పి ఒక నీతికథ చెప్పాడు.

దేవికోట్టమ్ అనే పట్టణంలో దేవశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను పేదవాడు. బ్రాహ్మణార్థాలు చేసుకొని జీవయాత్ర సాగిస్తున్నాడు. ఒకనాడు అతను ఒక సంపన్న గృహస్థు ఇంటికి తద్దినం భోజనానికి వెళ్ళాడు. అక్కడి షడ్ర సోపేతమైన విందు భుజించారు. పీకవరకు పరమాన్నం త్రాగాడు, పొట్టనిండా గారెలు భుజించాడు. ఆ యింటివారిచ్చిన పేలపిండిని కడవలో పోసుకుని ఇంటి దారి పట్టాడు.

కొంతదూరం వచ్చేసరికి ఆయాసం వచ్చింది. పైగా ఎంతగాఉన్నందున ఇక ప్రయాణం వేయలేననుకొన్నాడు. అక్కడ విశ్రమించాలని అటు యిటు చూశాడు. దగ్గరలో ఒక కుమ్మరి తాటాకు ఇల్లు కనిపించింది, ఆ తాటాకు ఇంటిలో చల్లగా విశ్రమింగవచ్చునని భావించి అక్కడకు వెళ్ళాడు.

బ్రాహ్మణుడి కష్టాన్ని అర్థంచేసుకొన్న కుమ్మరి అక్కడ విశ్రమించ మన్నాడు, బ్రాహ్మణుడు పేలపిండి కుండను కాళ్ళదగ్గర పెట్టుకొని అక్కడ విశ్ర మించాడు, అతని చుట్టూ కుండల బారులు ఉన్నాయి,

బ్రాహ్మణుడు పడుకొని ఆలోచించసాగాడు. ఈ పేలపిండిని అమ్మితే కొంత డబ్బు వస్తుంది. ఆ డబ్బుతో ముందుగా ఒక ఆవును కొంటాను, ఆ ఆవు



పేలపిండిని మోసుకొని పోవుచున్న బ్రాహ్మణుడు

పాలతో వ్యాపారం చేస్తాను. పైగా ఆవు కోడెదూడను పెడుతుంది. దాన్ని అమ్ముతాను. డబ్బు వస్తుంది. ఇంకా ఆవుల్ని కొంటాను. అవిచ్చే పాలని, పెట్టే దూడల్ని అమ్మి బాగా సంపాదిస్తాను. ప్రతియేటా డబ్బు పెరుగుతుంది. ధన వంతుణ్ని అవుతాను. మేడ కొంటాను. పెళ్ళి చేసుకుంటాను. అన్ని సౌకర్యాలు అమర్చుకొంటాను. దాస, దాసీ జనాన్ని పెట్టుకొంటాను.

నా భార్య పిల్లల్ని సరిగా చూడకపోతే ఇలా తన్నుతాను-అని బ్రాహ్మణుడు పేలపిండి కుండను, అక్కడి కుండలను ఆవేశంతో తన్నాడు, అవన్నీపగిలి పోయాయి. పేలపిండి మట్టిపాలైంది. బ్రాహ్మణుడి ఆశలు అడియాశలయ్యాయి. పైగా కుండలు బద్దలుకొట్టినందుకు కుమ్మరి నిందించాడు. అందుచేత పేరాశ పనికి రాదని ఈ కథ చెపుతుంది.

## మేక - కుక్క

మోసం మాటలతో మేకను, కుక్కను మేక అని ఒప్పించవచ్చు. హిరణ్య



మేకను తీసుకొని వెళ్ళుచున్న బ్రాహ్మణుడు

గర్భుడు. సర్వజ్ఞుడు నిన్ను ఎలానమ్మారని చిత్రవర్ణుడు అడిగినప్పుడు మేఘవర్ణుడు

ఈ నీతికథ చెప్పాడు.మంచివాడిని సులభంగా మోసంచేయవచ్చునని పైగా నలుగురు చెప్పినమాట నీతిగా నిజంగా చెలామణీ అవుతుందని మేఘవర్ణుడు ఈకథ చెప్పాడు.

ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణుడు. అతను బాగా చదువుకున్నాడు. కాని లౌక్యం తెలిసినవాడు కాదు. వెర్రిబాగులవాడు. నలుగురూ ఏం చెపితే అదే నిజం అని నమ్మే అమాయకుడు.

ఒకరోజున ఆ బ్రాహ్మణుడు యజ్ఞం చేయాలని అనుకున్నాడు. మంచి



మొదటిదొంగ ఏమండీ పంతులుగారు నల్లకుక్కను తీసుకొని వెళుచున్నారే అనుచున్న దొంగ

మేకను కొనుక్కొని పట్టణంనుండి వస్తున్నాడు. అడవి దారిగుండా ప్రయాణిస్తున్నాడు, నలుగురు దొంగలు ఆ బ్రాహ్మణుణ్ని మోసం చేయాలని, ఆ మేకను దొంగిలించుకొని పోవాలని ఆలోచించి ఒక పథకం వేశారు. నలుగురు నాలుగుచోట్ల దూర దూరంగా నిలిచారు.

బ్రాహ్మణుడు మేకను తీసుకొని వడివడిగా వెళుతున్నాడు. ఒకచోట మొదటిదొంగ ఎదురుపడ్డాడు.

"అదేమిటి బ్రాహ్మణుడుగారూ! నలుపు కుక్కను తీసుకువెళుతున్నారు? మీరు శాస్త్రులు చదివినవారు కద! కుక్కను ముట్టుకోవచ్చునా? అని దొంగ ముక్కున వేలు వేసుకున్నాడు. అప్పుడు బ్రాహ్మణుడు నవ్వి "ఓరీ వెర్రిబాగుల వాడా! నీ కళ్ళు సరిగా కనిపించడంలేదా? ఇది జాతిమేక- యజ్ఞానికి సంతలో కొని తీసుకువెళుతున్నా" అని మందలించి వెళ్ళాడు. కొంతదూరం వెళ్ళేవరికి రెండవ దొంగ ఎదురుపడ్డాడు.

"అదేంటి పంతులుగారూ! నల్లకుక్కను తీసువెళుతున్నారు? మీ వాళ్ళెవ రైనా చూస్తే వెలివేస్తారు" అని బ్రాహ్మణుని సమాధానానికై ఎదురుచూడక వెళ్ళి పోయాడు ఆ రెండవదొంగ. బ్రాహ్మణునికి కొంచెం అనుమానం కలిగింది, కాని అనుమానం మంచిదికాదని ముందుకు వెళ్ళిపోయాడు.

కొంతదూరం వెళ్ళేసరికి మూడవదొంగ ఎదురుపడి "పంతులుగారూ ఏ సంతలో కొన్నారీ కుక్కని? మా భలేగా వుంది" అని వేళాకోళంగా అన్నాడు, బ్రాహ్మణునికి కోపం వచ్చింది. "ఏం వేళాకోళంగా ఉందా? ఇది జాతిమేక" అని వాడిని కసురుకొని ముందుకు వెళ్ళిపోయాడు. అతనిలో ఆలోచన బయలుదేరిం

'ఒకడు కాదు, ఇద్దరుకాదు, ముగ్గురు మోతుబరులు దీన్ని కుక్క అన్నారు. నిజంగా ఇది కుక్కేనేమో?' అనుకుంటూ కొంతదూరం వెళ్ళేవరికి నాలుగవ దొంగ కనిపించాడు.

"ఏంటి బాపనయ్యగారూ! మరీ ఇంత అమాయకులా? కుక్కకీ. మేక! తేడా తెలీదా? నల్లకుక్కని మీకెవడంటగట్టాడు? అయ్యయ్యో! ఎంత అపచారం?

బ్రాహ్మణుడు ఈ మాటలు విని కంగారుపడ్డాడు. 'దీన్ని కుక్క అని ఇప్పటికి ముగ్గురు చెప్పారు ఇతను నాలుగవవాడు. నిజంగా ఇది కుక్కే. సందేహం లేదు. నన్ను సంతలో వాళ్ళు మోసగించారు. ఈ కుక్కతో ఊరిలోకి వెళితే స్వజాతివారు వెలివేస్తారు. దీన్ని వదలివేస్తాను,

ఇలా ఆలోచించి బ్రాహ్మణుడు ఆ మేకను అక్కడవదలివెళ్ళిపోయాడు.

దొంగ ఆ మేకను తీసుకొని గబగబ నడిచివెళ్ళి తన మిత్రుల్ని కలుసుకున్నాడు.

"నలుగురాడిన మాట నీతి అవుతుంది. మంచిమాటలతో ఎవరినయినా



మేకను వదలి వెళ్ళిపోవుచున్న బ్రాహ్మణుడు, మేకను పట్టుకొన్న దొంగ

సరే మోసగించవచ్చు. హిరణ్యగర్భుణ్ని అలాగే మంచి పలుకులతో మోసగించవచ్చును" అని మేఘవర్ణుడు ఈ కథ చెప్పాడు.

అంతేకాదు మంచిమాటలు చెప్పి వాటితో మసలి మన పని చేశాను కద. అలాగే పూర్వం పాము ఒకటి కప్పల్ని మోసగించిన కథ చెపుతాను అని మేఘవర్ణుడు ఆ వివరం చెప్పాడు.

# అయోమయం కప్పలు

అవసరం వచ్చినపుడు శత్రువును కూడా ఎంతగానో సేవించాలి, నేను అలాగే సేవించాను. చివరకు వారి కోటకు నిప్పుపెట్టాను. పూర్వం ఒక పాము కూడా అలాగే శత్రువుల్ని మోసి చివరికి వాటిని భక్షించింది అని మేఘవర్ణుడు చిత్రవర్ణునకు ఆ కథ ఇలా వివరించాడు.



కప్పలను మోయుచున్న పాము

ఒక పెద్ద చెరువు వుంది. దానిలో చాలా కప్పలు ఉన్నాయి, ఆ పరిసరాలలో ఒక పాము తిరుగుతుండేది. దాని పేరు మందవిషం. అది ముసలిదయింది. ఎక్కువ శ్రమపడి ఆహారం సంపాదించుకోలేకపోతోంది. అందుచేత ఆ కప్పల దగ్గరకు వచ్చి ఇలా అంది :

"ఓ కప్పలారా! నేను మహాపాపం చేశాను. అదేమంటే ఒక బ్రాహ్మణ బాలకుణ్ని కాటు వేశాను. అతడు నేలకూలాడు. అప్పుడు అతని తండ్రి వచ్చి నన్ను శపించాడు."

"ఏమని శపించాడు?" అని కప్పలు అడిగాయి.

"నీవు భక్షించే కప్పల్ని తినక, వాటినే నీ భుజాన నిలుపుకొని తిప్పు. అదే నీకు శిక్ష అని బ్రాహ్మణుడు నాకు శాపం యిచ్చి తన కొడుక్కి పాము మంత్రం వేసి బ్రతికించుకొని వెళ్ళిపోయాడు."

"నేను అటు యిటు తిరుగుతూ యిటు వచ్చాను. ఇక్కడ మీరు కనిపించారు, మీకు సేవచేసే భాగ్యం కలిగించి నాకు శాప విమోచనకు అవకాశం కలిగించండి" అని పాము ప్రార్థించింది.

పాము మాటలకు కప్పల రాజు జలపాదుడు యెంతగానో బాధపడ్డాడు. "పాపం ఆ పామును ఆదుకుందాం" అని తన ప్రజలకు చెప్పాడు. అవి అంగీకరించాయి.

జలపాదుని ఆజ్ఞ ప్రకారం పాము నీటిలోకి దిగింది. జలపాదుడ్ని, అతడి మంత్రులను నడ్డిపై ఎక్కించుకుని చెరువంతా ఈదింది. మధ్యాహ్నం అయింది. అప్పుడు పాము ఒక చోట ఆగిపోయి ఆయాశపడసాగింది. దాని అవస్థ చూసి జలపాదుడు సంగతేమిటని అడిగాడు.

"ఏముంది జలపాదా! నిన్నటినుండి ఆహారం లేదు, నీరసంగా వుంది" అంది మందవిషం.

అప్పుడు జలపాదుడు ఇలా అన్నాడు.

"ఓయీ పామా! అటుపోయి కొన్ని కప్పల్ని తినరా. నీ ఆకలి తీరుతుంది.

కప్పలరాజు ఆనతి ప్రకారం పాము జరజర పాకి అటువైపు వెళ్ళింది. కడుపునిండా చిరుకప్పల్ని తింది. మరల వచ్చి కప్ప రాజును, మంత్రులను వీపు మీద కూర్చుండ బెట్టుకొని మరల చెరువులో విహారయాత్ర చేయించింది.

ఇలా రోజులు గడిచాయి. రోజూ ఇదే తంతు జరిగింది. చెరువులో



కప్పలను తింటున్న పాము

కప్పలు అన్నీ పాముకు ఆహారం అయ్యాయి. ఇక జలపాదుడు, అతడి మంత్రులు మిగిలారు. ఒకనాడు మందవిషం అతి నేర్పుగా జలపాదుణ్ని అతని మంత్రుల్ని కడుపార భుజించాడు.

# తెలివైన కోతి

అవసరం వచ్చినప్పుడు శత్రువునైనా సరే సేవించాలని ఈ కథ చెబుతోంది.

మోసం ఒక ఉపాయమే కాని ఆ మోసాన్ని గుర్తించే తెలివైనవారుంటే, అది నెరవేరదని హెచ్చరించే ఈ కథను మేఘవర్ణుడు తన రాజైన చిత్రవర్ణునికి చెప్పాడు.

ఒక అడవిలో యెన్నో కోతులు మందగా ఉంటున్నాయి. వాటిలోని ఒక కోతి పేరు బలవర్ధనుడు. అది తెలివైనది, చురుకైనది. అడవి అంతా తిరిగి రకరకాల కాయలు, పళ్ళు సంపాదించి తింటుండేది. ఒకనాడు అది అడవిలో తిరుగుతూ ఒక నది ఒడ్డున మేడిచెట్టును చూసింది. ఆ చెట్టునిండా పళ్ళున్నాయి. ఆ కోతి ఒక పండుకోసి రుచి చూసింది. యెంతో తీపిగా వుంది. అయితే ఆ పళ్ళు రుచి మరిగి బలవర్ధనుడు అక్కడే ఉండిపోయాడు.

పైగా ఒకసారి ఒక పండును నీటిలో వేశాడు. అది 'బుడుంగు' అని శబ్దంచేసి మునిగిపోయింది. కోతి ఆ శబ్దం విని మరీ మురిసిపోయింది. రోజూకడుపు నిండా పళ్ళు తినడం, కొన్ని మేడిపళ్ళు నదిలోవేసి వినోదించటం దాని కార్యక్రమం అయింది. ఇలా రోజులు గడుస్తున్నాయి.

ఒకరోజు ఆ నదిలోనుంచి క్రకచము అనే మొసలి అటుగా వచ్చింది. మేడిపళ్ళు తింది. రుచిగా ఉన్నాయనుకొని అలా తింటూనే ఉంది. కొంతసేపటికి పళ్ళు తినడం ఆగిపోయింది. అప్పుడు మొసలి నీటిపైకి తేలింది. కోతిని చూసింది. కోతి మొసల్ని పరిశీలనగా చూసింది.

రెండింటికీ కనుచూపుతోనే స్నేహం కుదిరింది, ఒకదానికొకటి పరిచయం చేసుకున్నాయి. పొగడుకొన్నాయి, జత కలుపుకొన్నాయి. మొసలి తన ఇంటిని మరిచిపోయి కోతి దగ్గరే ఉండిపోయింది. ఎన్నాళ్ళకు భర్త ఇంటికి రాకపోయేసరికి మొసలి భార్యకు దిగులు పెరిగింది. అది నదిలో వెదికింది. చివరకు కోతి దగ్గర ఆనందంగా ఉన్న భర్తను చూసి కోపగించి ఇంటికి వెళ్ళిపోయింది



మేడిపండ్లను నీటిలో వేయుచున్న కోతి

ఒకనాడు క్రకచానికి భార్య జ్ఞాపకం వచ్చింది. వెంటనే కొన్ని మేడిపళ్ళు పట్టుకొని ఇంటికి వచ్చింది. దూరాన్నుంచే భర్తను చూసిన ఆడ మొసలి వెంటనే ఇంటిలోనికి వెళ్ళిపోయింది.

క్రకచం భార్య దగ్గరకు వెళ్ళి కుశల మడిగాడు. మేడిపళ్ళు ఇచ్చాడు. ఆడ మొసలి కోపంగా చూసింది. బాధగా మూలిగింది మేడిపళ్ళు తిప్పికొట్టింది.

అప్పుడు క్రకచం భార్యను బతిమలాడి సంగతేమిటని అడిగాడు. అద మొసలి ఇలా అంది.

"నాకు జబ్బు చేసింది. కోతి గుండె తింటేనే కాని నయం కాదు. నీకేం ఇంటి గొడవ, ఇల్లాలి గొడవపడితే కదా!"

భార్య మాటలకు క్రకచం యెంతో బాధపడింది. తన తప్పిదానికి క్షమాపణ కోరింది. అప్పుడు అద మొసలి ఇలా అంది.

"బాధపడినంత మాత్రాన నా జబ్బు నయంకాదు. నీ మిత్రుడు ఉన్నాడుగా. ఆ కోతిని తీసుకురా నా జబ్బు నయమవుతుంది."

భార్య మాటలను క్రకచం ముందు కొంచెం బాధపడింది. మిత్రుడ్ని బలిపెట్టడం దానికి ఇష్టంలేదు. కాని తప్పదు. భార్యను కాపాడుకోవాలి.

ఇలా ఆలోచించి క్రకచం మేడిచెట్టు దగ్గరకు వెళ్ళాడు. చాలా రోజులకు కనిపించిన మిత్రుడ్ని చూసి బలవర్ధనుడు కుశలం అడిగాడు. అప్పుడు మొసలి ఇలా అంది.

"మిత్రుడా! బలవర్ధనా! నేను కుశలంగా ఉన్నాను. నువ్వు క్షేమమే కదా! నీవంటి మంచి మిత్రుణ్ని తీసుకురాలేదని నా భార్య నన్ను మందలించింది. ఈనాడు నువ్వు మా ఇంటికి విందుకు రావాలి. చెట్టు దిగి నా వీపున కూర్చొంటే నిన్ను మా ఇంటికి తీసుకు వెళతాను.

మొసలి మాటలు నమ్మి కోతి యెంతో సంతోషించి చెట్టు దిగింది. గట్టు మీదనుంచి ఒక్క గెంతు గెంతి, మొసలి వీపున కూర్చున్నది. క్రకచం కొంత దూరం వేగంగా ఈదింది. అలా ఈదుతూ ఆలోచించింది.

"అయ్యో! బలవర్ధనుని వంటి మిత్రుణ్ని మోసగించి చంపవలసి వస్తున్నది కదా! ఎంత పాపం! ఏం చేయగలను. భార్య ప్రాణాలు కాపాడుకోటానికి ఇంతకన్నా వేరే ఉపాయమే లేదు. ఈ ప్రాంతములో ఎక్కడా కోతులు లేవు. విశ్వాసఘాతాన్ని ఎవరు హర్షించరు. నదీ ప్రవాహం మధ్యలో వున్నాము. కనుక

ఇప్పుడు ఈ సంగతి చెప్పేసిన నాకు అసత్యదోషం ఉండదు. కోతి ఈనదీప్రవాహం మధ్యనుంచి తప్పించుకోలేదు.'

ఇలా ఆలోచిస్తూ నెమ్మదిగా ఈదుతున్న మొసలిని కోతి యిలా ప్రశ్నించింది. "మిత్రమా! పరధ్యానంగాఉన్నావేం? ఇంతవరకు ఉత్సాహంగా, వేగంగా



మొసలి ఇంటికి వెళ్ళు కోతి

ఈదిన నువ్వు ఆకస్మాత్తుగా నెమ్మదిగా ఈదుతున్నావేం?విచారంగా కనిపిస్తున్నావేం?"

కోతి మాటలు విని మొసలి "మిత్రుడా! నా భార్యకు తగని జబ్బు చేసింది. కోతి గుండెను వండిపెట్టమని వైద్యులు చెప్పారట. నీకు ముందుగా యీ సంగతి చెప్పలేదని విచారిస్తున్నాను" అంది.

కోతికి తను వున్న పరిస్థితి అర్థం అయింది. తన మిత్రుతయిన క్రకచుని వంచన అర్థమయింది. క్రకచుని భార్య తన స్నేహాన్ని విడగొట్టాలని ఈ పన్నాగం పన్నిందని గ్రహించింది. తనను మోసం వేయాలనుకున్న ఆ మొసలిని మోసం తోనే బుద్ధి చెప్పాలనుకొని ఇలా అంది :

"అయ్యో! మిత్రమా! ఎంత పనిచేశావ్? నా గుండెను ఇవ్వడానికి నాకు అభ్యంతరం ఏమీలేదు. కాని ఉదయం ఆ గుండెను శుభ్రంచేసి యింటిలో పెట్టాను అది ఇప్పుడు నా దగ్గరలేదు. కనుక వెనుకకు పద. చెట్టుపై ఉన్న గుండెను తీసుకువద్దాం."

కోతి మాటలు ఆంతర్యం తెలియక మొసలి వెనక్కు తిరిగింది. క్షిప్త కాలంలో చరచర చెట్టుమీదకు ఎక్కిపోయింది.

ఎంతసేపటికి క్రిందకు దిగిరాలేదు. క్రకచం విసుగుచెంది కోతినిరమ్మని పిలిచింది. అప్పుడు బలవర్ధనుడు ఇలా అన్నాడు.

"ఓరీ మిత్రద్రోహి! భార్యమీది వ్యామోహంతో నన్ను చంపాలను కొన్నావు. నీకిదే శాస్తి. వెళ్ళు వెళ్ళు. గుండె యెక్కడయినా శరీరం బయట వుంటుందా? బుద్ధిమాలినవాడా! నీతో ఇక స్నేహం చేయను. నీ దారిన నువ్వు పో?"

క్రకచం అవమానపడి, చేసేది ఏమీలేక ఇంటిదారిపట్టింది. బలవర్ధనుడు హాయిగా కాలం గడిపాడు. మోసాన్ని మోసంతోనే జయించాలని ఈ కథ నీతి.

## గడుసు తాబేలు

గడుసుదనం ఉంటే ఎలాంటి మోసాన్ని అయినా జయించవచ్చునని చెప్పే ఈ కథను కూడా మేఘవర్ణుడే చెప్పాడు,

ఒక అడవి వుంది. ఆ అడవిలో ఒక చెరువుచుట్టూ చెట్లు పెరిగి, చల్లగా ఉంటుంది. అందుకని చెరువులో తాబేలు పైకి వచ్చి ఆ నీటిలో తిరుగుతుండేది.

అలా షికారు తిరుగుతుండగా నక్క ఒకటి అటుగా వచ్చింది. కుళ్ళిన మాంసాలు తిని నాలుక రుచి చచ్చిపోయింది. ఈవేళ ఈ తాబేలు మాంసం దొరికిందని ఆనందించింది. మాటువేసి తాబేలును పట్టుకొంది.



తాబేలుని కాళ్ళతో ఒడిసిపట్టుకున్న నక్క

తాబేలు వెంటనే తన తలను, తోకను, కాళ్ళను డొరునులోనికిముడుచుకొంది. తాబేలు పైన, క్రింద గట్టి పెంకు ఉంటుంది. దానినే డొరును అంటారు. అపాయం వచ్చినప్పుడు తాబేలు తన అవయవాలను లోపలికి లాగుకొని, తనను తాను రక్షించుకొంటుంది. ఇప్పుడూ అలాగే చేసింది.

నక్క మాత్రం దానిని వదిలిపెట్టలేదు. అటు యిటు తిప్పింది. అయినా మెత్తటి మాంసం దొరకలేదు. నక్కనుంచి ప్రాణాలు కాపాడుకోవాలని తాబేలు ఒక ఉపాయం ఆలోచించింది. తన మాంసం తినాలని తాపత్రయపడుతున్న నక్కతో తాబేలు ఇలా అంది :

"ఓయీ నక్కబావా! నేలమీద గాలి తగిలి చర్మం గట్టిపడిపోతుంది.



నీటిలో వదలగానే పారిపోవుచున్న తాబేలు

ఇక్కడ ఉన్నంతసేపు నీకు నా మాంసం దొరకదు. నీటిలో నానపెట్టు. అప్పుడు చర్మం మెత్తబడుతుంది,"

తాబేలు మాటలు నమ్మి నక్క తాబేలుని చెరువులో వేసింది. అంతే, ఆ తాబేలు దబదబ ఈదుకొని [illegible] పోయి ప్రాణాలు కాపాడుకొంది.

# తొందరపాటు తగదు

ఎంతటివారైనా తొందరపాటువలన నష్టపోయి దుఃఖిస్తారు కనుక తొందరపాటు తగదు అని బోధించే ఈ నీతి కథను చిత్రవర్ణునికి అతని మంత్రి అయిన దూరదర్శి చెప్పాడు.

ఒక అగ్రహారంలో దేశవర్మ, యజ్ఞసేన అనే బ్రాహ్మణ దంపతులుండే



ఊయ్యాలలో బాబుని చూడమని ముంగిసతో చెప్పుచున్న బ్రాహ్మణుడు

వారు. వారికి చిన్నపిల్లవాడున్నాడు. ఇంటిలో వారు ముంగిసను పెంచుతున్నారు. అది చాలా మంచిది. ఒకనాడు దేవవర్మ ఏదో పనిమీద పొరుగూరు వెళ్ళాడు. యజ్ఞసేన చెరువుకు నీళ్ళకై వెళ్ళింది. ఇంటివద్ద ఊయలలో పిల్లవానిని పడుకో బెట్టింది, వాడు నిద్రపోతున్నాడు. ముంగిస వాకిలిలో కాపలా ఉంది.

ఇంతలో వెనుంచి ఒక పాము ఊయల మీదుగా ప్రాకసాగింది.

ముంగిస దానిని చూసింది. అది బాలుణ్ని కాటు వేయకుండా కాపాడా లని ముంగిస ఒక ఎగురు ఎగిరి పాముని పట్టుకుని క్రింద పారవేచింది. పాము బుస్సుమని లేచింది, ముంగిస దానిమీద వురికింది. రెండూ పోరాడాయి. చివరకు ముంగిస పామును చంపివేసింది.



పామును చంపుతున్న ముంగిస

నోటికి అంటినరక్తం నాకుతూ అది వీధి గుమ్మంవైపు వచ్చింది. ఎదురుగా యజమామరాలు వచ్చింది. ముంగిస నోటివున్న నెత్తురు చూసి అమె అనుమాన పడింది. పిల్లవాణ్ని చంపిందని భావించి చంకలోవున్న బిందెను ఆ ముంగిసపై వేసింది. ఆ దెబ్బకు అది చచ్చిపోయింది.

యజ్ఞసేన లోపలకు వెళ్ళి చూసేసరికి పిల్లవాడు ఊయలలో సురక్షితంగా వున్నాడు. అక్కడ నేలపై మూడు ముక్కలయిన పాము శరీరం వుంది. యజ్ఞసేన జరిగిన దానిని ఊహించుకొని తన తొందరపాటుతనం వలన మంచి ముంగిస చచ్చిపోయిందని విచారించింది.

అందుచేత "తొందరపాటు తగదు" అని యీ కథ హెచ్చరించింది.

ఇంతటితో "సంధి" ప్రకరణం, దానిలోని కథలు పూర్తి అయ్యాయి. 'లబ్ధనాశం' కథలు కూడా ఇంచుమించు ఇదే ఫక్కీలో వుంటాయి. వీటిని ఉపదేశించి విష్ణుశర్మ సుదర్శన మహారాజుగారి మగపిల్లల్ని ధీరులుగా, విజ్ఞాన వంతులుగా తయారుచేశాడు.

నాటినుంచి నేటివరకూ ఇకముందుకూడా పంచతంత్ర కథల్ని చెప్పు కొంటూనే వుంటారు. ప్రపంచ కథాసాహిత్యంలో పంచతంత్రానిది వొక విశిష్టస్థానం అందుకే వీటిని మరల అవధరిస్తూనే వుంటారు. స్వస్తి.

## భలే పక్షులు

"మిత్రలాభం, మిత్రభేదం" ప్రకరణాలలో జంతువులు ప్రధానభూమిక నిర్వహిస్తాయి. వాటి పేర్లు వివరణలు తెలుసుకుందాం.

హిరణ్యగర్భుడు : హంస. ఇది జల పక్షులకు రాజు. పొట్టనిండా బంగారము వున్న వాడని అర్థం. అంటే ఉత్తముడని భావం.

సర్వజ్ఞుడు : ఇది సారపక్షి. హిరణ్యగర్భుని మంత్రి, సకల విషయాలు తెలిసిన వాడు.

దీర్ఘముఖుడు : ఇది కొంగ. పొడవైన ముఖం కలవాడని అర్థం. పండితుడు.

వీరవరుడు : ఇది సారసపక్షి. యుద్ధవిద్యలు నేర్పినదిట్టు!

ధవళాంగుడు , ఇది కొంగ. తెల్లటి శరీరావయవాలు గలవాడు. హిరణ్యగర్భుని కొలువలో గూఢచారి.

చిత్రవర్ణుడు : నెమలి. ఆకాశపక్షులకు రాజు. విచిత్రమైన శరీరవర్ణం గలవాడు.
దూరదర్శి : గ్రద్ధ. చిత్రవర్ణుని మంత్రి, రాజనీతి తెలిసినవాడు.
అరుణముఖుడు : చిలక. చిత్రవర్ణుని కొలువులో ముఖ్యుడు. రాయబారి, ఎర్రని ముఖం గలవాడు.
మేఘవర్ణుడు : కాకి. నలుపు శరీరం గలది. చిత్రవర్ణుని గూఢచారి. రాజనీతి, కుటిల నీతి తెలిసినది.
చిరంజీవి ; ఇది కాకి. కథాంతరంలో వస్తుంది.
మేఘవర్ణుడు : ఇది ఒక కాకి. కథాంతరంలో వస్తుంది.
ఉపమర్ధనుడు : గుడ్లగూబల రాజు. కథాంతరంలో వస్తుంది.
రోమాంశుడు : పిల్లి. ఒళ్ళంతా వెంట్రుకలు గలది. కథాంతరంలో వస్తుంది.
పలితుడు : ఎలుక. కథాంతరంలో వస్తుంది.
తామ్రచూడుడు : కోడిపుంజు. సేనాని, చిత్రవర్ణుని అనుచరుడు. ఎర్రజుట్టు గలవాడు.
కపింజలం : ఒక పక్షి. కథాంతరంలో వస్తుంది.
దీర్ఘ కర్ణుడు : కుందేలు. పొడవయిన చెవులు గలది.
ధధీకర్ణుడు : కుందేలు. పొడవయిన చెవులుగలది.
ధధీకర్ణుడు : పిల్లి, తెల్లటి చెవులు గలది.
మందవిషము : ఒక పాము.
జలపాదుడు : కప్పలరాజు. నీటిలో ఈదడానికి అనువయిన కాళ్ళు గలది.
బలవర్ధనుడు : కోతి. బలం గలది.
క్రకచము : మొసలి.

పంచతంత్రంలోని ప్రతి పేరు ఆ జంతువు లేదా పక్షియొక్క స్వరూపాన్ని, స్వభావాన్ని వివరించే విధంగా వుంటుంది. పేరు చెప్పగానే ఆ జంతువు లేదా పక్షి మనకు స్ఫురిస్తుంది. పుస్తకం చదివారు కనక మీరూ ప్రయత్నించండి.

—(◯)—